విశ్వ సాహిత్యమాల: 21.

# కూలి పని: పెట్టుబడి.

కారల్ మార్క్సు.

అనువాదం:

మహీధర జగన్మోహన్ రావు.

ఫిబ్రవరి 1940.

విశ్వసాహిత్యమాల,

ముంగండ,

(వయా) అంబాజీపేట, తూర్పుగోదావరి జిల్లా.

1849 యేప్రియల్ నెలలో 'న్యూ రేనిష్ జీటంగ్' లో మార్క్సు వ్రాసిన వ్యాసాలు.

1939 యేప్రియల్ నెలలో, 90 సంవత్సరాలకు తెలుగులోకి అనువదించబడింది.


అవంతీ ప్రెస్,
ముంగండ.


వెల 6 అణాలు.

# భూమిక.

ఈ కరపత్రం మొట్టమొదట్లో ‘న్యూ రేనిష్ జీటుంగ్’ పత్రికలో వ్యాసాల రూపంలో వెలువడింది. బ్రిస్సెల్స్ నగరంలోని ‘జర్మన్ వర్కింగ్ మన్స్ క్లబ్’ లో 1847 లో మార్క్స్ యిచ్చిన ఉపన్యాసాల నుంచే దీని మాతృక తయారు చేయబడింది. 1849 ఏప్రియల్ 4వ తేదీని ప్రారంభమైన యీ వ్యాస పరంపర పూర్తి కానేలేదు. 269 వ సంచికలోని సంపాదకీయంలో యీ వ్యాసాలు యింకా వస్తాయని వాగ్దానం యివ్వబడినా, ఆ కాలం నాటి ఒడుదుడుకుల్ని బట్టి నెరవేర్చ బడలేదు. రష్యనులు హంగరీ పై దండెత్తి వచ్చేరు; డ్రెస్‌డెన్, ఇసర్ ల్హోన్, ఎల్బర్ ఫెల్డ్, పెలాటినేట్, బేడెన్ లలో తిరుగుబాట్లు జరిగినాయి; వీటికి ఫలితంగా 1849 మే 19 వ తేదీన పత్రికను ప్రభుత్వం అణిచేసింది. మార్క్స్ వదిలి పెట్టిన వ్రాత ప్రతుల్లో యీ వ్యాసాలను సంబంధించినవేమియూ దొరకనేలేదు.

‘కూలి- పని : పెట్టుబడి’ యనే దీనిని ప్రత్యేక కరపత్రంగా ఎందరో ప్రచురించేరు. వాటిలో కడపటిది 1847 లో జూరిచ్ ‘హాట్టింజన్’ లోని “స్విస్ సహకార ముద్రణాలయం”

వారిచే ముద్రించబడి, ప్రకటించ బడినది. అసలువ్యాసాన్ని బట్టి, యింతవరకు ప్రచురించ బడిన యీ కరపత్రాలు యథా తథంగా అనువదించ బడినాయి. ఈ సారి అధమం పదివేల ప్రతులైనా ముద్రించి, ప్రచారం కోసం వినియోగింప దలపెట్టి నందువల్ల "వీటిన్ని యథా ప్రకారంగానే ముద్రించడమా?" అనే ప్రశ్న బయలుదేరింది. మార్క్సు వున్నట్లయితే యేమిచేసి వుండేవాడు?

మార్క్సు, 1850 నాటికింకా అర్థశాస్త్రంమీద తన విమర్శను ముగించివుండనేలేదు. ఈ పనిని 1860 నాటి కాతడు పూర్తి చేసేడు. (*Critique of Political Economy*) అర్థ శాస్త్ర విమర్శ' 1859 లో వెలువడింది. అంతకుపూర్వం మార్క్సు వ్రాతల్లో సందిగ్ధంగానూ, చివరకు తప్పులుగానూ కూడా వున్న మాటలూ, వాక్యాలూ, కనిపిస్తాయి. [తరువాత మార్క్సు తానే యీ విషయాన్ని వ్రాసుకున్నాడు.] గ్రంథకారుని విజ్ఞానాభివృద్ధినీ, పరిణామాన్నీ తెలుసుకోడానికి సాధారణంగా మూలానుసరణమే మంచిది: ప్రజలకీ, గ్రంథకర్తకూ మూలగ్రంథమే కావాలనడానికి హక్కుంది. ఆ పక్షంలో నేనూ మూలగ్రంథంలో ఒక్క అక్షరాన్నైనా మార్చాలని పొరపాటునైనా అనివుండకనే పోదును. కాని, యీ ముద్రణ కేవలం ప్రచారం నిమిత్తమే వేస్తూన్నాము. ఈ పక్షంలో మార్క్సు అయినప్పటికీ 1849 లోని తనవ్రాతల్ని తన నూతన దృక్పథంతో సరిచేసుకుని వుండే వాడే. ఆయా సందర్భాల్లో నేను చేసిన స్వల్ప మార్పులూ,

చేర్చిన అదనపు వాక్యాలూ కూడా, కేవలం మార్క్సు యొక్క ఊహల ననుసరించే చేస్తూన్నా నని తలుస్తాను.

ఇప్పుడు, పాఠక మహాశయునితో యీలా అంటే బాగుంటుంది: ఈ కరపత్రం 1849 లో మార్క్సు వ్రాసినది కాదు. 1891 లో మార్క్సు ఏలా వ్రాసి యుండే వాడో ఆరీతిగా వ్రాయబడినది. మూలగ్రంథం యొక్క ప్రతులు వేలకొలదీ ప్రచారంలో వున్నాయి. త్వరలోనే మార్క్సు గ్రంథాలన్నీ సంపూర్ణాలుగా ప్రచురించ దలచే వున్నాను. అందులో మార్క్సు మూల ప్రతినే యథాతథంగా వుంచుతాను. అంతవరకూ ప్రస్తుతం ప్రచారంలో వున్న ప్రతులే చాలును.

ఇంక.– నేను చేసిన మార్పులన్నీ ఒక్క విషయంమీదనే కేంద్రీకరించబడి వున్నాయి. మూలాన్ని బట్టి చూస్తే :– పెట్టుబడిదారునికి కార్మికుడు తన 'శ్రమ' లేక 'పని' ని విక్రయిస్తాడు. ప్రస్తుతపు మార్పును బట్టి;– కార్మికుడు తన 'శ్రమ-శక్తి' ని విక్రయిస్తాడు. ఈ మార్పు చేసినందుకు నేను సమాధానం చెప్పవలసి వుంది. మనం యిక్కడేదో మాటలతో గారడీ చేస్తూన్నామని గాని తలచక, అర్థశాస్త్ర సంతటికీ అతి ముఖ్యమైన విషయాన్ని తెలుసుకుంటూన్నామని, కార్మికులు గ్రహించేటట్లు చేయడం మనవిధి. ఎంతో సున్నితంగా వుండే యీలాంటి సమస్యలు, అహంకారులైన మన "చదువుకున్న వాళ్ళకి" జీవితమంతా ధారపోసినా అవగాహన కావు, ఏ చదువూ లేని కూలీలకే యీలాంటి, అర్థ

శాస్త్రీయ విషయాలు తేలికగా బోధపడతాయనీ, బూర్జువాలు తెలుసుకునేటట్లు చేయాలి.

పెట్టుబడిదారుడు తన పనివాళ్ళ శ్రమను డబ్బిచ్చి కొంటున్నట్లు, పారిశ్రామికుల లెక్కల్లో పరిపాటిగా వాడుక అయిపోయింది. సాంప్రదాయకమైన అర్థశాస్త్రం * కూడా యీ అభిప్రాయాన్నే యెరువు తెచ్చుకుంది. పారిశ్రామికుల యీ అభిప్రాయంవల్ల లెక్కలు చూసుకోడానికీ, ఖరీదులు కట్టుకోడానికీ, యితర వ్యాపారాదుల్లోనూ కూడా యెంతో సౌల

---

* 'IV. పెట్టీ' కాలాన్నుంచీ బూర్జువా సమాజంలోని ఉత్పత్తి సంబంధాల యొక్క యథార్థ రూపాల్ని తెలుసుకుని; కేవలం బాహ్యరూపాలతోనే తృప్తిజెందే క్షుద్రమైన అర్థ శాస్త్రాన్ని కాలదన్ని; శాస్త్రీయమైన అర్థశాస్త్రం ప్రసాదించిన సూత్ర పరికరాలతో పునరాలోచనలు సాగిస్తూ, అనాహూతాలుగా కనపడే సంఘటనకు బూర్జువా దృష్ట్యా వ్యాఖ్యానాలు చేస్తూ; అంతకు మిగిలిన విషయాల్లో మాత్రం శాశ్వతమైన యథార్థాలను మాకు-గా, "తమ గొప్పకు తామే మురిసిపోయే" బూర్జువాల నీరస భావాల్నీ, అల్పపాండిత్య గరిమను చూపి, క్రమబద్ధ మొనరించడానికి యత్నిస్తూ,- వుండేదే సాంప్రదాయకమైన అర్థశాస్త్రమని నా అభిప్రాయం.

[కారల్ మార్క్సు, కాపిటల్; 53 పుట.]

శ్యం కలిగింది. కాని, అమాయకంగా యీ తప్పుడభిప్రాయాన్ని అర్థశాస్త్రంలోకి తీసుకు పోవడంతో, మరెన్నో తప్పులకూ, గందరగోళాలకూ దారి తీసింది. నిజంగా యిదే అద్భుతము!

అన్ని వర్తకపు సరకుల యొక్క - ఖరీదు, - అందులోనూ 'పని' అనే సరకు యొక్క - ఖరీదు కూడా, - నిరంతరమూ మారుతూంటుందనే విషయం బుజువైందే. దీనిని అర్థశాస్త్రం కూడా అంగీకరించింది. ఆ యా సరకుల ఉత్పత్తితో యేమీ సంబంధమే లేని అనేక పరిస్థితుల ప్రభావం చేత, వాటి ఖరీదులు హెచ్చుతూ, తగ్గుతూ వుంటాయనీ, అందుచేతనే సరకుల ధరలు కేవలం యాదృచ్ఛికంగానే నిర్ణయించబడుతూన్నాయని అనుకోవలసి వస్తూందనీ అర్థశాస్త్రం అంగీకరించింది. అందువల్ల అర్థశాస్త్రం తానూ ఒక శాస్త్రాన్నే అంటూ ముందుకు రాగానే యీ యాదృచ్ఛికనిర్ణయాలకి వెనుక దాగొన్న నియమాల్ని వెదకి, కనుగొనవలసిన బాధ్యత మీద పడింది. సరకుల ఖరీదులు నిరంతరం మారుతూ, ఒకసారి హెచ్చుతూ, మరొకసారి తగ్గుతూ, వుండడము చేత, ఏ మధ్య కీలకం చుట్టూ యీ మార్పులూ, ఊగులాటలూ, జరుగుతూన్నాయో తెలుసుకోవలసి వచ్చింది. ఒక్క మాటలో చెప్పాలంటే, - సరకుల ఖరీదుల్నీ, వాటిని శాసించే నియమమైన సరకుల విలువను [అన్ని సరకుల ఖరీదుల్నీ వాటి విలువగా మార్చుకో వచ్చును.] అన్వేషించింది.

ప్రతిసరుకు యొక్క విలువయూ, దానిలో యిమిడి

యున్న శ్రమనుబట్టి, అంటే దాని నుత్పత్తి చేయడాని కవసర మైన శ్రమ శక్తినిబట్టియే నిర్ణయించ బడుతూందని, సాంప్రదా యక అర్థశాస్త్రం తెలుసుకొని, అంతతో తృప్తి పొందింది. మనం కూడా ప్రస్తుతం మటుకు యిక్కడే ఆగుదాము. కాని, మనము పొరపాటు పడకుండా వుండడానికి ఒక్క విషయం జ్ఞాపకం చే స్తాను. నేడు, యీ సమాధానం యెంతమాత్రం సరిపడదు. ప్రతి సరుకూ విలువనిచ్చే శ్రమ యొక్క లక్షణాల్ని సంపూర్ణంగా పరి శీలించినవాడు, మార్క్సు. అంతేగాక, ఏసరకు యొక్క ఉత్పత్తి కైనా నిజంగా అవసరమైనదైన, అవసరమనితోచు, శ్రమ అంతా అన్ని సందర్భాల్లోనూ, ఆ సరకు విలువను హెచ్చించ డానికి తోడ్పడదనీ, ఆయా శ్రమల యొక్క స్వభావాన్ని బట్టి కూడా అది ఆధారపడి వుంటుందనీ, మొట్టమొదట్లో మార్క్సు పరిశో ధించేను. అందుచేతనే నేడు మనం, ఏ సరకు విలువనైనా దాని నుత్పత్తి చేయడాని కవసరమైన శ్రమనుబట్టి నిర్ణీత మవుతూందని క్లుప్తంగా చెప్పేటప్పుడు, అర్థశాస్త్రజ్ఞులతో వాదిస్తున్నాము, అంటే మార్క్సు పెట్టిన యీ నియమాలనూ, మినహాయింపులనూ లోబడేనని జ్ఞాపకంవుంచుకోవాలి. ప్రస్తుతం మనకు యీ మాత్రం చాలు. ఇంకా విపులంగా తెలుసుకోవాలని కోరే వాళ్ళు మార్క్సు 1859 లో వ్రాసిన 'అర్థశాస్త్ర విమర్శ' అనే గ్రంథా న్నీ, కాపిటల్ మొదటి సంపుటాన్నీ చదవండి.

సరకుల విలువ వాటిలో యిమిడియున్న శ్రమ శక్తిని

బట్టి వుంది.' కాని, యీ సూత్రాన్నే, 'శ్రమ' [పని] అనే సరుకు యొక్క విలువను అంచనా వేయడంలో ఉపయోగించేటప్పటికి అర్థశాస్త్రజ్ఞులు త్రోవా తెన్నూ తెలియని చిక్కుల్లో పడిపోయేరు. 'శ్రమ' యొక్క విలువను నిర్ణయించడం ఎల్లా? ఒక పనివాని యొక్క ఒక్కరోజు శ్రమలో యెంత 'అవసరమైన శ్రమ' వుందో దాన్ని బట్టా! ఒకరోజు శ్రమను బట్టేనా? విలువన్ని కొలిచే కొలమానం 'శ్రమ-శక్తి.' అయితే శ్రమ యొక్క విలువను 'శ్రమ' లోనే చెప్పగలము. తేడా యేమిటి? ఒకరోజు శ్రమ యొక్క విలువను గూర్చి యింకను తెలిసిందేమిటి? అది కేవలం ఒకరోజు శ్రమతో సమానమని మాత్రం తెల్సింది! ఒకరోజు శ్రమ యొక్క విలువ 'ఒకరోజు శ్రమ' తో సమానం! దీనివల్ల మనం ఒక్క అడుగు కూడా ముందుకు పోలేదు. విషమ చక్రంలోపడి గిరగిరా తిరుగుతూంటాము.

ఇక్కడికి వచ్చేటప్పటికి సాంప్రదాయిక అర్థశాస్త్రం యింకో వైపు తిరిగింది. ఏదైనా సరుకు యొక్క విలువ, దానిని ఉత్పత్తి చేయడానికయ్యే ఖర్చుతో సమానం, అని సమాధానము చెప్పింది. అయితే 'శ్రమ' నుత్పత్తి చేయడానికి ఎంత ఖర్చు అవుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి అర్థశాస్త్రజ్ఞులు కొంచెం తికమకలు పడవలసివచ్చింది. దురదృష్టవశాత్తూ 'శ్రమ' నుత్పత్తి చేయడానికయ్యే ఖర్చును లెక్క కట్టడం అసాధ్యమని తేల్చుకున్నారు. అందుచేత 'పనివానిని' ఉత్పత్తి చేయడానికయ్యే

ఖర్చును గుణించడానికి ప్రయత్నించేము. ఈ మొత్తం, కాలాన్ని బట్టీ, పరిస్థితుల్ని బట్టీ మారుతూవుంటుంది. కాని, ఒక నిర్దిష్ట సమాజంలో, ప్రదేశంలో, పరిశ్రమలో,- యీ 'పనివాణ్ణి' ఉత్పత్తి చేయడానికయ్యే మొత్తాన్ని కొంచెం యించుమించుగా చెప్పగలము.

మనం ప్రస్తుతం పెట్టుబడిదారీ సమాజంలో వుంటూన్నాము. ఈ సమాజంలో అత్యధిక సంఖ్యాకులు తమ శ్రమను పెట్టుబడిదారునికీ,- అంటే భూమి, గనులు, యంత్రాది సాధనాలు, ముడిపదార్థాలు, జీవితావసరము లైన యితర పదార్థాలు, కలిగివుండే యజమాని వర్గానికి విక్రయించి, కొంత ప్రతిఫలం తీసుకుంటూ, తమ జీవితాల్ని గడుపుకో గలుగుతూన్నారు. ఇలాంటి వాళ్ళ సంఖ్య రోజు రోజుకూ పెరిగిపోతూంది. ఇటువంటి ఉత్పత్తి విధానం క్రింద ఒక పనివాని నుత్పత్తి చేయడానికగు మొత్తం ఖర్చు, అతని భరణానికగు వస్తువులకు లేక వాటి ఖరీదుకు సమానమని తేలుతోంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే.- కూలివాడు పనిచేసే శక్తి గలవాడుగా ఉండడానికీ, పనిచేసే శక్తి అతని యందు నిలిపి వుంచడానికీ, వ్యాధివల్లగాని, ముసలితనంవల్ల గాని, మరణం వల్లగాని ఒకడు తొలగిపోయి నప్పుడు అతని స్థానంలో మరొకని నుంచడానికిన్నీ, అంటే కార్మికవర్గాన్ని అవసరమయినంత సంఖ్యలో సృష్టించుకోడానికీ, అయ్యే మొత్తము ఖర్చులకి, లేదా వాటికి సమానమైన సరకులకు సమాన మన్నమాట.

ఒక పనివాని జీవితభృతి మొత్తంమీద 3 షిల్లింగులు అవుతుందనుకొందాము. అందుచేత మన పనివాడు రోజుకు 3 షిల్లింగులు కూలిని తన యజమాని దగ్గర నుంచి పుచ్చుకుంటాడు. ప్రతిఫలంగా పెట్టుబడిదారుడు పన్నెండు గంటలు పనిచేయించుకుంటాడు. "కూలివాడు, ఒక యంత్రభాగాన్ని ఒకరోజులో చేస్తాడనుకుందాము. దానికి బట్ట యినుము, యిత్తడి మొదలైన ముడిపదార్థాల ఖరీదు 20 షిల్లింగులు అవుతుంది. యంత్రాల అరుగుదల, తరుగుదలా, బొగ్గు మొదలయిన వాటి ఖరీదు, ఒక రోజుకి, ఒక పనివాడు చేసే పనికి ఒక షిల్లింగు అవుతుందనుకుందాము. కూలి, పనం లెక్క చూసినట్లుగా 3 షిల్లింగులు. మొత్తం ఆ యంత్రభాగం తయారుచేసే టప్పటికి 24 షిల్లింగులు ఖర్చవుతుంది." ఈ రీతిగా పెట్టుబడిదారుడు అంచనాలు వేసుకుంటాడు.

ఈ యంత్రభాగానికే పెట్టుబడిదారునకు అమ్మకంవల్ల 27 షిల్లింగులు లభిస్తుందనుకుందాము. అంటే పెట్టుబడి అంతా పోగా పైగా 3 షిల్లింగులు అదనంగా వస్తుంది.

పెట్టుబడిదారు జేబులో వేస్తూన్న 3 షిల్లింగులూ ఎక్కడ నుంచి వస్తున్నాయి? అర్థశాస్త్ర(ప్ర)కారం,- సరుకులన్నీ కడపటికి వాటి వాటి విలువలకే అమ్ముడు బోతూంటాయి. అంటే వాటిని తయారు చేయడానికవసరమైన మానవశ్రమను బట్టి యీ ధరలుంటాయని అర్థం. మన పెట్టుబడిదారునికి యంత్రభాగం వల్ల వస్తూన్న 27 షిల్లింగులూ, దాని విలువకు సమానము.

అంటే, దానిలో యిమిడివున్న శ్రమశక్తికి సమానం అయితీరాలని శాస్త్రజ్ఞుల సిద్ధాంతం. యంత్ర నిర్మాత, తన పనిని ప్రారంభిం చక పూర్వం వున్న పదార్థాల విలువ 21 షిల్లింగులకు సమానం అని యిదివరలో చెప్పేముగదా! దానికి కావలసిన లోహాలు, బొగ్గు, యంత్రాల అరుగుదలా వగైరాలన్నీ ధన రూపములో మార్చుకున్నా 21 షిల్లింగులే అవుతుంది. ఇంక మిగిలిన 6 షిల్లిం గులూ, కూలిపనివాని "శ్రమ" వల్లనే ఆ ముడిపదార్థాలకు చేర్చ బడిందని, అర్థశాస్త్రజ్ఞులే ఋజువు చేస్తూనారు. పనివాడు చేసిన 12 గంటల శ్రమా 6 షిల్లిగులు ఖరీదు చేసే "విలువను" సృష్టి చేసిందన్న మాట. అంటే 12 గంటలశ్రమా 6 షిల్లింగులకు సమా నము అవుతూంది. ఈ రీతిగా "శ్రమ యొక్క విలువ" దెంతో చిట్ట చివరకు తెలుసుకో గలిగేము.

ఇదంతా విని పనికూలివాడు ఆశ్చర్యపడతాడు. "అదుగో! అక్కడా కు! 6 షిల్లి గులే? మరినాకు కూలి 3షిల్లింగులే ముట్టిం దేమి? మా శెట్టుబడిదారుడు, నా పని 3 షిల్లింగుల కంటే ఎక్కువ చేయదని చెప్తూన్నాడు. 6 షిల్లిగులు యిమ్మంటే నన్ను చూసి నవ్వుతాడు కూడాను. ఏమిటీ తమాషా అంతా!"

ఇంతవరకు ముందే శ్రమయొక్క విలువను తెలుసుకోందా మని యత్నించి విషమచక్రంలో పడ్డాము. ఇప్పుడు పరస్పర వైరుధ్యంలో పడిపోయేము. శ్రమ యొక్క విలువను అన్వేషించి, అర్థం కాని సమస్యలో తగులుకున్నాము! 12 గంటల పనియొక్క

విలువ కూలివానికి 3 షిల్లింగులు; అదే పెట్టుబడి దారునికి 6 షిల్లింగులు,— యిందులోనే 3 షిల్లింగులు కూలివాని కిచ్చి, మిగిలిన 3 షిల్లింగులూ తానే జేబులో వేస్తూన్నాడు. దీన్నిబట్టి 'శ్రమ' కు రెండు వేర్వేరు విలువలున్నాయనీ, వాటి కెంతో భేదం, అంతరం వుందనీ తెలుసుకున్నాము.

ఇంతవరకూ ధనరూపంలో విశదీకరించిన విలువల్ని 'శ్రమ- కాలము' ( Labour-time ) లోనికి మార్చేమంటే యీ వైరుధ్యాలు మరింత విస్పష్టంగా కనిపిస్తాయి. 12 గంటల పనివల్ల నూతనంగా 6 షిల్లింగుల విలువ సృష్టింపబడింది. దాన్నిబట్టి 3 షిల్లింగుల విలువా 6 గంటల్లోనే సృష్టి అయిందని తేలుతూందిగదా. ఈ 3 షిల్లింగులే కూలివానిచే 12 గంటలు పని చేయించుకుని యిస్తూన్నారు. ఇక్కడికి వచ్చేటప్పటికి మనం యేదో ఒకటి నిర్ణయించుకో వలసి వస్తూంది: శ్రమకు రెండు విలువలు వుండనైనా వుండాలి. అందులో ఒకటి మరొకదానికన్న రెట్టింపు. లేదా, పన్నెండు- ఆరుతో సమానమే అవాలి. రెండూ రెండే! కేవలం అసందర్భ విషయాలే! 'శ్రమను' అమ్మడం, కొనడం,- అనేవాట్లను గురించి ఆలోచించినంతకాలం, మనము ఎన్ని తిప్పలుపడినా, తికమకలు చేసినా 'శ్రమయొక్క విలువ' లోవున్న యీ వైరుధ్యాన్నుంచి బయటపడనేలేము. అర్థశాస్త్రజ్ఞులకూ యిదే తటస్థించింది. సాంప్రదాయక అర్థశాస్త్రంయొక్క కడపటి శాఖమైన 'రైకార్డియన్‌లు'కూడ యీ వైరుధ్యాన్ని సరి

చేయలేక సతమతమైపోయేరు. అర్థశాస్త్రమే అంధకారబంధురం, అగమ్యగోచరం అయిన చిక్కులో పడిపోయింది. ఈ చిక్కులో నుంచి బయటకుతీసి, దారి చూపినవాడే కారల్ మార్క్సు.

'శ్రమ'నుత్పత్తి చేయడానికయ్యే ఖర్చుకింద అర్థశాస్త్రజ్ఞులు లెక్క చెప్పినది యథార్థంలో 'శ్రామికుని' జీవనానికి అయ్యే ఖర్చు అయివుంది. ఈ పనివాడు విక్రయించేది తన 'శ్రమ' గాదు. "అతడు పని ప్రారంభించే టప్పటికే యీ 'శ్రమ' అతనిది గాకపోవడం చేత దాని నాతడెట్లు విక్రయిస్తాడు? తన 'కూలిని' లేక 'పని' ని కూలీ విక్రయించవలసిన లేదు," అని మార్క్సు చెప్పేడు. అంతగా అయితే పనివాడు తన భవిష్యత్ శ్రమను విక్రయించుకో గలడు; అంటే ఒకపనిని నిర్దిష్ట కాలంలో చేసి యిస్తాననే ఒప్పందమును మాత్రం చేయగలడు. ఈ రీతిగా అతడు తన పనినిగాక (పనిని ముందేచేసి తర్వాత కూలి నిర్ణయించుకోవలసివుంటుంది) తన 'శ్రమశక్తి'ని, ఒక నిర్ణీతమైన ధనానికి (కూలికి) ఒక పరిమిత కాలంవరకూ (రోజుకూలి అయితేనూ), లేదా ఒక నిర్దిష్టమైన పని పూర్తిచేసే వరకూనూ (గుత్తపని అయితే) పెట్టుబడిదారుకి స్వాధీనం చేస్తూన్నాడు: లేదా విక్రయిస్తున్నాడు. ఈ 'శ్రమశక్తి' పనివానితో అవినాభావసంబంధము గలదైవుంది. అందువల్లనే, 'శ్రమ శక్తి' నుత్పత్తి చేయడానికయ్యే ఖర్చు— 'శ్రామికుని నుత్పత్తిచేయడానికయ్యే ఖర్చు,— యీ రెండూ ఒకటే అవుతూన్నాయి. శ్రమ నుత్పత్తి చేయడానికగు ఖర్చుని, అర్థ

శాస్త్రజ్ఞులంచనా వేసే మొత్తమే- శ్రామికునీ, వానితోబాటు శ్రమశక్తినీ ఉత్పత్తి చేయడానికయే మొత్తము. ఇంతతో ఆగకుండా మనం యింకా ముందుకుపోయి, శ్రమశక్తినుత్పత్తిచేయుడానికగుఖర్చునూ, తర్వాత శ్రమశక్తియొక్క విలువనూ, తద్వారా ఒక్కొక్క తరహా శ్రమశక్తియొక్క ఉత్పత్తి కవసరమైన సామాజిక శ్రమయొక్క పరిమాణమునూ నిర్ణయించుకోగలుగుతాము. 'శ్రమశక్తిని కొనుట, అమ్ముట' అనే ప్రకరణములో మార్క్సు యీ విషయాన్ని వివరించేడు. (కాపిటల్, మొదటి సంపుటం, రెండోభాగం, ఆరోప్రకరణం.)

పనివాడు తనశ్రమశక్తిని విక్రయించిన తర్వాత యేమి జరుగుతూంది! అంటే తనశ్రమశక్తిని నిర్ణీతమైన కూలికి (గంటల కూలి కానీ, గుత్తకూలి కానీ) పెట్టుబడిదారుని స్వాధీనం చేసిన తర్వాత యేమి జరుగుతూంది? పెట్టుబడిదారుడు, కూలివానిని తనఫ్యాక్టరీలోనికో, వర్కుషాపులోనికో తీసుకుపోతాడు. అక్కడ పనిచేయించడానికి కావలసిన పరికరములన్నీ సిద్ధంగా వుంటవి. ముడిసరుకులు, సహాయక పదార్థాలు, (బొగ్గు, రంగులు వగైరా,) యంత్రాలు, పనిముట్లు వగైరాలన్నీ అక్కడ సిద్ధంగా వుంటాయి. వాటితో కూలి-పనివాడు పనిచేయడం ప్రారంభిస్తాడు. అతనికి ఒక రోజుకు యిచ్చే కూలి, 3 షిల్లింగులనుకుందాము. రోజు కూలిగాకానీ, గుత్తకూలిగాకానీ అతనికి ముట్టేది, అంతే. 12 గంటలు పనిచేసి, అతను వెనుకటి ముడిపదార్థాల విలువకు

6 షిల్లింగుల విలువను చేరుస్తూ న్నాడు. తయారైన వస్తువును, విక్రయించడంవల్ల పెట్టుబడిదారునికి మొత్తం లభిస్తూంది. నూతనంగా సృష్టించబడిన యీ విలువలో నుంచి పెట్టుబడిదారుడు, పనివానికి కూలికింద 3 షిల్లింగులు యిచ్చేస్తూ, మిగిలిన 3 షిల్లింగులూ తానే వుంచుకుంటూన్నాడు. కూలివాడు 12 గంటలు పనిచేసి 6 షిల్లింగుల విలువను సృష్టించగలుగుతే, 6 గంటల్లో 3 షిల్లింగుల విలువనూ పూర్తి చేస్తూన్నాడన్న మాటే! అందుచేత పెట్టుబడిదారునికై 6 గంటలు పనిచేయడంవల్లనే తాను తీసుకుంటూన్న 3షిల్లింగుల విలువనూ పూర్తిచేసి పెడుతూ న్నాడు. 6 గంటలపని అయిన తరువాత ఒకరొకరికి బాకీ సాకీలేమీ వుండవు. అంటే, పెట్టుబడిదారునికీ కూలివానికీ, చెల్లుబాకీ అయిపోతూంది.

'ఆగు! అక్కడాగు!' అంటాడు, యిక్కడి కొచ్చేటప్పటికి పెట్టుబడిదారుడు:"కూలివాణ్ణి ఒకరోజు కంతకూ కుదుర్చుకున్నాను. 12 గంటలు పనిచెయ్యాలి. 6గంటలు పనిచేస్తే ఒకపూట అవుతూంది. మిగిలిన ఆరుగంటలూ కలాసాగా పనిచేయి. ఆలా అయితేనే మనకు పేచీ పూచీ లుండవు." యదార్థంలో కూడా కూలిపనివాడు, తాను 'స్వతంత్రంగా, యిచ్ఛా పూర్వకంగా,' చేసుకున్న కంట్రాక్టు ప్రకారం అంగీకరించక తప్పడంలేదు. ఆరు గంటలు పని చేస్తేనే సరిపడే కూలికి యితడు 12 గంటలు పని చేయడానికి ఒప్పుకున్నాడుగదా!

గుత్తపని(Piece-work,) విషయంలో కూడా యింతే.

12 గంటల్లో కూలివాడు 12 వస్తువుల్ని తయారుచేస్తాడనుకుందాం. తయారయేటప్పటికి ఒక్కొక్క వస్తువుకు 2 షిల్లింగులు (ముడిపదార్థాలు, యంత్రాల అరుగుదలా, తరుగులు వగైరాలతో) అవుతూం దనుకొందాము. ఆ వస్తువులు ఒక్కొక్కటి $2\frac{1}{2}$ షిల్లింగులకు అమ్ముకబోతూం దనుకుందాము. ఏర్పరచుకున్న ప్రకారం ఒక్కొక్క వస్తువుకు $\frac{1}{4}$ షిల్లింగుచొప్పున 12 వస్తువులకూ 3 షిల్లింగులు 'కూలి' యిస్తాడు. ఈ 3షిల్లింగులు సంపాదించడానికి కూలివాడు 12 గంటలు పని చేయవలసి వుంటుంది. 12 వస్తువులు విక్రయించుట వల్ల 30 షిల్లింగులు పెట్టుబడిదారునికి లభిస్తూంది. ముడిపదార్థాలూ, యంత్రాది సాధనాల అరుగుదలా, తరుగుదలా, మొత్తం 24 షిల్లింగులు. పెట్టుబడి పోతే మిగిలినవి 6 షిల్లింగులు. అందులో 3 షిల్లింగులూ కూలికింద యిచ్చి, మిగిలిన 3 షిల్లింగులూ జేబులో వేస్తూన్నాడు. ఎప్పటి లెక్కే! ఇక్కడకూడా కూలివాడు తనకోసం 6 గంటలూ, మిగిలిన 6 గంటలూ పెట్టుబడిదారుని కొరకూ పని చేస్తూన్నాడు!

అర్థశాస్త్రజ్ఞులలో మహామహులంతా 'శ్రమ యొక్క విలువ' తో ప్రారంభించి, బోల్తా కొట్టేసేరు. కాని కూలివాడు అమ్ముతూన్నది 'శ్రమ' గాక 'శ్రమశక్తి' యని, మనం ప్రారంభించేటప్పటికి యీ సమస్య యేచిక్కూ లేకుండా విడిపోతూంది! ప్రస్తుతపు పెట్టుబడిదారీ సమాజంలో 'శ్రమశక్తి' అనేది, అన్ని యితర సరుకులవలెనే ఒక అమ్మకపువస్తువే! కాని యిందు

లో ఒక చిత్రం వుంది. దీనికి 'విలువ' ను సృష్టించే శక్తి వుంది. అంతేగాదు. సరిగా పనిచేయించుతే దానికున్న దానికంటె యెక్కువవిలువను సృష్టించుతుంది. ప్రస్తుతపు ఉత్పత్తి విధానంలో, మానవుని శ్రమశక్తి తన ఖరీదుకంటే (కూలికంటే) యెక్కువ విలువను సృష్టించడమే కాకుండా ప్రతి కొత్త శాస్త్రీయ పరిశోధనలతోనూ, ప్రతీ నూతనయంత్రపరికరం వాడుకలోకి రావడంతోనూ, అది తన ఖరీదుకన్న యెన్నోరెట్లు యెక్కువగా విలువల్ని సృష్టిచేస్తూంది. ఎందువల్ల? ఈ యంత్రసాధనాలకు ఫలితంగా ఆ పనివాడు చేయవలసిన 'పని-గంటలు' తగ్గిపోతూంటాయి. తాను తీసుకునే కూలికి ప్రతిఫలంగా పనిచేయవలసిన గంటలు తగ్గిపోతూ, తన యజమానికి తేరగా పనిచేయవలసిన గంటలు హెచ్చుతూవుంటాయి.

నేటి పెట్టుబడిదారీ సమాజంయొక్క ఆర్థిక నిర్మాణము యీ లాంటిదే! శ్రామికవర్గమే విలువలనన్నిటినీ సృష్టిచేస్తూంది. ఎల్లాగ? 'విలువ' అనేది 'శ్రమ' అనేమాట యొక్క పర్యాయపదమే. ఆ నిర్దిష్ట వస్తువులలో, సామాజికంగా అవసరమైన శ్రమ ఎంత పరిమాణంలో యిమిడివుందో, యీ 'విలువ' అనేది వ్యక్తపరుస్తూంది. కాని, శ్రామికులచేత సృష్టించబడిన యీ విలువలు శ్రామికులకు చెందడంలేదు, ముడిపదార్థాలు, యంత్రాలు, పరికరాలు, ధనము, - వీట్లన్నిటికీ అధిపతులై, కార్మికవర్గము యొక్క శ్రమశక్తిని కొనగలిగిన పెట్టుబడిదారీ వర్గానికే యీ విలువలన్నీ

(పదార్థాలు) చేంగతూన్నాయి. అందువల్లనే కూలీవర్గము తనచే తయారుచేయబడిన మొత్తం పదార్థసంచయంలో కేవలం ఒక్క భాగాన్ని మాత్రమే పొందగలుగుతూన్నారు. మనం యిప్పుడు చెప్పినరీతిగా దానిలో అధికభాగాన్ని పెట్టుబడి దారీవర్గమే, భూస్వామ్య వర్గంతో కలసి భుక్తపరచుకుంటూంది. పెట్టుబడి దారీవర్గానికి పోతూన్న యీ వాటా, ప్రతి కొత్త పరిశ్రమతోనూ మరింత అధికాధికం (యెక్కువ) అవుతూంది. కూలీవర్గానికి ముడుతూండే భాగంమాత్రం బహునెమ్మదిగా హెచ్చుతూండడంగాని, హెచ్చకనే పోవడం గాని, యింకా తగ్గిపోవడం కాని తటస్థించుతూ వుంది.

ఈ నవీన శాస్త్రీయ పరిశోధనలు, యంత్రాది సాధనాలు ఒకదానితర్వాత ఒకటిగా పైబడుతూ, మానవశ్రమయొక్క ఉత్పత్తిశక్తిని ఆ రోజుకారోజు హెచ్చుస్తాయి లోనికి గొనిపోతూవున్నాయి. ఇవే చిట్టచివరకు స్పర్థలకు కారణమై, పెట్టుబడిదారీ విధానానికే వినాశాన్ని తెచ్చిపెడతాయి. ఒకప్రక్క అంతులేని సంపదలు పోగుపడుతూ, కొనేవాళ్ళశక్తికి మించిపోతూ, వస్తు సముదాయం మిగిలిపోతూంది. ఇంకోప్రక్క, సమాజంలో అత్యధిక సంఖ్యాకులు శ్రామికులుగా మారిపోతూ, కూలిపనివాళ్ళుగా అయిపోయి, యీ సంచితవస్తు సముదాయాన్ని పొందడానికి అసమర్థులైపోతూన్నారు. అంతకంతకు సమాజంలోని వర్గవిభాగము విస్పష్టమైపోతూంది. ఒకవర్గం చాల స్వల్ప సంఖ్యాకమైనదై,

అత్యధిక భాగ్యవంతం గానూ; మరొక వర్గం అత్యధిక సంఖ్యాకు లు గలదై కూలిపనివాళ్ళై, ఏమీ ఆస్తి పాస్తులు లేక, జీవితావస రాలకే యెంతో బాధ పడిపోతూంటే; ఆ మొదటి ధనికవర్గము తమధనాన్ని, సంపదల్ని వినియోగం చేసుకోలేక మూలుగు తూవుంది.

ఈ పరిస్థితులు రోజు రోజుకూ మరింత అనవసరములూ, అసంగతాలూ ఔతాయి. వీటినుండి తప్పించుకో వలసి వస్తుంది; తప్పించుకో గలము, కూడాను. నూతనమైన ఒక సామాజిక విధా నము నేర్పాటు చేసుకోగలము. అందులో నేడున్న వర్గవిభేదా లన్నీ అదృశ్యమైపోతాయి. ప్రస్తుత విధానంలోనుంచి ఆ నూ తన విధానంలోకి మార్పు చెందేటప్పటి మధ్య కాలం యెంతో దీ ర్ఘమై వుండును. ఈ మార్పుచెందే కాలం(transition period) కొన్ని కొన్ని విషయాల్లో లోపసహితమై వున్నా, నైతికంగా ఎంతో ప్రయోజన కారి యై వుంటుంది. సమాజంయొక్క ఉత్ప త్తిశక్తి బ్రహ్మాండంగా అభివృద్ధి చెంది,- అటుతర్వాతి జీవితానికి కావలసిన సాధనాలు, జీవిత సుఖానుభవ వస్తువులు, దైహిక మా నసిక శక్తులయొక్క అభివృద్ధికి కావలసిన పరికరాలు, పనిచేయ డానికి అవసరమైన సాధనాలు,- ఇవన్నీ సమకూర్చడంతో బా టు, పని చేయవలసిన బాధ్యతల్ని మానవు లందరి మీదా వుంచు తుంది. ప్రపంచమంతటా కూలీలు రోజు రోజుకూ యీ నూతన సమాజ విధాన నిర్మాణంలో యెక్కువగా, దృఢ నిశ్చయంతో

పని చేస్తారనే విషయం, తెల్లవారడం తోనే, రేపటి 'మే- డే' నాడు, మే నెల 3 వ తేదీ ఆదివారంనాడూ కూడా ప్రపంచం అంతటా ఋజువు చేయబడుతుంది.

లండన్,<br>30. 4. 1891.

ఫ్రెడరిక్ ఎంగిల్స్.

# కూలి-పని: పెట్టుబడి.

## ఒకటో ప్రకరణం.

### ప్రాతిపదిక.

ప్రస్తుతం చాలచోట్లలో ఒకజాతికీ మరొక జాతికీ, ఒకవర్గానికీ మరో వర్గానికీ మధ్య తీవ్రపోరాటాలు యెక్కువైనాయి. ఈ పోరాటాలకు మూలకారణమైన ఆర్థికపరిస్థితుల్ని గురించి ప్రజలకు బాగా తెలిసేలాగ చిన్న పుస్తకరూపంలో వ్రాయనందుకు మనల్ని యెందరో మందలిస్తూన్నారు. రాజకీయ సంఘర్షణలకు ఫలితంగా ఆర్థికసమస్యలు వాటంతట అవే బయట పడినప్పుడు మనం వాటిని గురించి రాత్తుకొని, నిర్దిష్టాభిప్రాయాల్ని వెల్లడిచేస్తూన్నాము.

మన కాలంలో ముఖ్యంగా వర్గపోరాటాలు తీవ్రరూపము దాల్చేయి. స్వానుభవం ద్వారానే,

రోజురోజుకూ మనకు లభిస్తూన్న యథార్థ చారిత్రిక ప్రమాణాల వల్ల మనం అనేకవిషయాల్లో సరియైన నిర్ణయాలకు రాగలుగుతూన్నాము. 1848 ఫిబ్రవరి, మార్చి నెలల్లో ఫ్రాంసు దేశంలో కార్మికవర్గం అపజయాన్ని పొందింది. ఫ్రాంసు కార్మికవర్గ స్వాధీనతతో బాటు, ఒక్క ఫ్రాంసు దేశములోనేగాక యావత్ యూరపులోనూ యీ వర్గానికి ప్రతికక్షులైన బూర్జువా రిపబ్లికన్‌లూ, రైతులూ కూడా జమీందారీ నిరంకుశత్వానికి లోబడిపోయేరు. ఫ్రాంసులోని 'మోడరేట్ రిపబ్లిక్' [మితవాద ప్రజాస్వామ్యం.] యొక్క విజయమే, 1848 ఫిబ్రవరిలో ఫ్రాంసు కార్మికులతో బాటుగా విప్లవాల్ని బయలుదేర తీసిన యితర దేశాల ప్రజల అపజయాన్ని సూచించింది. యూరపుఖండ మంతటిలోనూ, విప్లవకారులైన కూలీలు అణిచివేయబడ్డారు. యూరపంతా తిరిగి ద్వంద్వ బానిసత్వంలోకి [ఇంగ్లీషు, రష్యన్ దేశాల్లోమాదిరి తొత్తు కింద పడితొత్తు] పడిపోయింది. 1848 జూన్‌లో పారిస్‌లోని సంఘర్షణలు; వియన్నా పతనము;

1848 నవంబరులో జరిగిన 'బెర్లిన్' విషాదాంత నాటకం; పోలాండు, యిటలీ, హంగేరీ దేశాల్లో నిరాశ వల్ల ప్రజలొనరించిన సాహసాలు; ఆహార పదార్థాలు వెళ్ళనీయక మూడ్చివేసి ఐర్లాండును ఖొంగదీయడం,- యివన్నీ యూరపులోని బూర్జువా, శ్రామిక వర్గాలమధ్య జరిగిన పోరాటాల్లోని ముఖ్య సంఘటనలు. ప్రతి విప్లవకరమైన తిరుగుబాటునూ,- [అది వర్గకలహం నాట్టుగా కనిపించినా,-] కార్మికవర్గము జయించే వరకూ నిరర్థకముగనే అయి తీరుతాయని, మనం పై సంఘటనలవల్ల తెలుసుకోగలము. విప్లవకారియైన శ్రామిక వర్గమూ, విప్లవ ప్రతి ఘాతుకమైన జమీందారీ ప్రభు వర్గమూ,- ఈ రెండు శక్తులూ ప్రపంచ మంతటా తీవ్ర యుద్ధంలోకి దిగేవరకూ, ఏ సామాజిక సంస్కరణమూ కూడా ఆచరణలోకి రాదని చెప్పగలము. మనం యిదివరలో సూచించిన రలిగా బెల్జియం, స్విట్జర్లాండు దేశాలు రెండూకూడా ప్రపంచ మాత్రల్లోకి హాస్యాస్పదము లైపోయి నాయి. ఒకటి బూర్జువా ఏకఛత్రాధి పత్యానికీ, రెండోది

బూర్జువా ప్రజా స్వామ్యానికి స్పష్టమైన ఉదాహరణలు; ఈ రెండు దేశాలూ, తాము యూరోపియన్ విప్లవాలనుంచీ, వర్గకలహాల నుంచీ కూడా దూరంగా వుండ గలిగేమని బడాయిలు కొడుతూన్నవే!*

మనపాఠకులు, 1848 వ సంవత్సరంలోని వర్గకలహం బ్రహ్మాండమైన రాజకీయ పోరాటంగా మారడాన్ని చూసే వున్నారు. అందుచేత పెట్టుబడిదారీ వర్గమూ, దాని పరిపాలనమూ, కూలీలయొక్క బానిసత్వమూ,- యివన్నీ యే ఆర్థిక పరిస్థితుల మీద ఆధారపడి వున్నాయో పరిశీలించ వలసిన తరుణము వచ్చిందనే చెప్పాలి.

ఈ విషయాన్ని ముఖ్యమైన మూడు విభాగాల్లో వివరించ యత్నిస్తాను:

*ఇది వ్రాసి నలభై సంవత్సరాలు పైగా అయిందని పాఠకులు గుర్తించాలి. ఈ రోజున స్విట్జర్లాండు లోనూ, యింకా ముఖ్యంగా ఇంగ్లండులోనూ కూడా వర్గకలహం విస్పష్టంగా కనిపిస్తూంది. కేవలం పై పై పరిస్థితుల్ని మాత్రమే చూసి, తృప్తి పొందేవాళ్ళు కూడా యీ విషయాన్ని అంగీకరించవలసి వస్తూంది.

- 1891 లోని ముద్రణకు అనువాదకునిమనవి.

1. కూలి-పనికీ, పెట్టుబడికీ గల సంబంధము, పనివాని బానిసత్వము, పెట్టుబడి దారుని సర్వాధికారము.

2. ప్రస్తుత సామాజిక విధానముక్రింద మధ్య తరగతులయొక్కా, సామాన్య ప్రజలయొక్కా అనివార్యమైన వినాశనము. ✱

3. 'వరల్డు-మార్కెటు'లో నిరంకుశాధికారంగల యింగ్లాండు దేశము యితర యూరోపియన్ దేశాల బూర్జువా వర్గాన్ని వ్యాపారక్షేత్రా లొంగుబాటు చేసుకుని, దోచుకుంటూండడం.♦

---

✱ 'కులీనులు' 'మతప్రచారకులు',- వీళ్ళకంటే భిన్నమైనవారే 'సాధారణప్రజలు' జమీందారీ యుగంలో స్వతంత్రులూ, నగరవాసులూ,- వీళ్ళనుంచి బయలుదేరిన యీ వర్గమే 'వర్తకులు',- పౌరులు,- అని పిలువబడుతూ, నేటి 'బూర్జువా వర్గానికి' మూలపురుషులైనారు. సంపాదకుడు.

♦'కూలి- పని: పెట్టుబడి' మీద వ్యాసాలు అసంపూర్ణంగానే వుండిపోయినాయి. ఈ విషయాన్ని యేంగిల్సు పీఠికలో చెప్పేవున్నాడు. మార్క్సు చెప్పిన యీ మూడు విభాగాల్లోనూ మొదటిదైన 'కూలి- పని: పెట్టుబడి' - ఈ రెండింటికీ వుండే

మనం యీ విషయాల్ని వీలయినంత సుబోధకంగానూ సులభంగానూ వ్యక్తీకరించ యత్నించాలి. అర్థశాస్త్రంలో యేమాత్రమూ ప్రవేశం లేనివాళ్ళకు కూడా మనం చెప్పేది తెలియాలి, మరి. చివరకి కూలివాళ్ళు కూడా మన బోధనల్ని గ్రహించాలి. చీలికలుగా వున్న జర్మనీలో జమీందారీ ప్రభువులు డజన్లకొద్దీ వున్నారు; వీళ్ళకంటె సంఖ్యలో యెన్నోరెట్లుగావున్నారు, ప్రస్తుతం పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించే వాళ్ళూ, బూటకపు సోషలిష్టులూ, రాజకీయ రంగంలో గుర్తించబడని అద్భుత మేధావంతులూ. వీళ్ళందరిలోనూ కూడా సర్వసామాన్య ఆర్థిక విషయాల్ని గురించిఎంతో అజ్ఞానమూ, పొరబాట్లూ వ్యాపించి వున్నాయి. అందుచేత మనం యీ విషయాల్ని గురించి వివరణను ప్రారంభిస్తాము.

---

సంబంధాన్ని గురించే యీ కరపత్రములో వ్రాయబడింది.

- సంపాదకుడు.

# కూలి-పని: పెట్టుబడి.

## రెండో ప్రకరణం.

### వేతనాలంటే ఏమిటి?

"మీకెంతెంత 'కూలి' యిస్తారు?" అని కొందరు పనివాళ్ళను అడిగితే, ఒకడు "నా యజమాని నాకు రోజుకు రెండు షిల్లింగులు యిస్తాడు," అంటాడు; యింకోడు "నాకు రోజుకు మూడు షిల్లింగులు వస్తాయి," అంటాడు. అందరూ యిలాగే చెప్తూ వుంటారు. వివిధ పరిశ్రమల్లోనూ పనిచేసే వాళ్ళందరూ, తమ యజమానుల వద్దనుంచి ఏదో ఒకపని పూర్తి చేసినందుకు ప్రతిఫలంగా ఒక నిర్దిష్టమైన మొత్తము లభిస్తుందని చెపుతారు. ఉదాహరణ చూద్దాం: ఒక గజము గుడ్డ నేయడానికి యింత; ఒక పేజీ అచ్చు కూర్చడానికి అంత; యిలాగే వుంటుంది. వాళ్ళు చెప్పే మాటల్లో భేదం వున్నా కానీ, అందరూ ఒక్క విష

యంలో మాత్ర మేకీభవిస్తూన్నారు. 'వేతనము' లేక 'కూలి' అంటే, ఒక నిర్దిష్టమైన కాలానికి గాని, ఒక నిర్దిష్టమైన పనికి గాని, పెట్టుబడిదారుడు పనివాని కిచ్చే మొత్తము.

ఇందువల్ల మనకు ఒకవిషయం తేలుతూంది. పనివాడు తన శ్రమను [పనిని] కొంతడబ్బు తీసుకుని పెట్టుబడదారునికి విక్రయిస్తూన్నాడు; పెట్టుబడిదారుడు డబ్బుతో పనివాళ్ళ దగ్గరనుంచి వాళ్ళ శ్రమను కొంటూన్నాడు. కాని, యీలా అనుకోడం కేవలం పొరబాటు! పనివాడు విక్రయిస్తూన్నదీ, పెట్టుబడిదారుడు కొంటూన్నదీ, యథార్థంగా పనివాని 'శ్రమశక్తి' ని, లేక 'పనిచేయగల శక్తి' నే! ఈ శ్రమశక్తి నే పెట్టుబడిదారుడు ఒకరోజుకు, నెలకు,- యిల్లే కొంటూన్నాడు. అతడు యీ 'శ్రమశక్తి' ని, కొన్న తర్వాత, నిర్దిష్టమైన కాలం పూర్తయే వరకూ కూలి పని వానిచేత పనులు చేయించు కుంటాడు. అంటే, తానుకొన్న 'శ్రమశక్తి' ని ఉపయోగించు కుంటాడు. 'శ్రమశక్తి' కై పనివాళ్ళకు యిచ్చే మొత్తముతో

[ఉదాహరణగా రెండుషిల్లింగులు తీసుకుందాము.] పెట్టుబడి దారుడు మరే సరకునైనా,— అంటే గోధుమలు, పంచదార వగైరాల నెన్నింటినో కొనగలడు. 20 పౌనులు పంచదారను రెండు షిల్లింగులకు కొన్నాడంటే, ఆ పంచదార ఖరీదు రెండుషిల్లింగులన్న మాట. అట్లే, శ్రమశక్తి యొక్క పన్నెండు గంటల ఉపయోగాన్ని రెండు షిల్లింగులకు కొంటూన్నాడంటే పండ్రెండు గంటల పని అంతఖరీదు కలదన్న మాట. ఈ రీతిగా మానవ శ్రమకూడా పంచదారకు వలెనే ఒక అమ్మకపు సరుకుగా అయిపోతూందని తెలుసు కున్నాము. 'శ్రమశక్తి' ని గంటలలో లెక్కించుచున్నాము: పంచదారను పౌనుల లెక్కను తూస్తూన్నాము. ఈ రెండూ అమ్మకపు సరుకులే; వీటిలో ఎక్కువ తక్కువలు లేవు.

పనివాళ్ళవద్ద 'శ్రమశక్తి' అనే సరకు వుంది. పెట్టుబడిదారు దగ్గర 'డబ్బు' అనే సరకు వుంది. పనివాళ్ళు 'డబ్బు' తీసుకుని 'శ్రమశక్తి' ని విక్రయిస్తూన్నారు. ఈ మారకం ఒక నిర్దిష్టమైన 'నిష్పత్తి' ( ratio ) లో

జరుగుతూంది. పంద్రెండుగంటల చేత : రెండు షిల్లిం గులు. ఈ రెండుషిల్లింగులకు మనం బజారులో ఎన్నో రకాల వస్తువులను కొనగలము. అంటే పనివాడు తన సరుకును [శ్రమశక్తిని] ఎన్నో రకాల బజారు వస్తువు లకు మార్చుకుంటూన్నా డన్నమాట! పనివానికి రో జుకూలి రెండు షిల్లింగులు యిస్తూన్నాడంటే, పెట్టు బడిదారుడు వానికి యిన్ని బియ్యము, యిన్ని కట్టెలు, యింత కిరోసిన్ నూని, యింత బట్ట,- యిస్తూన్నాడ ని అర్థం. ఈ రీతిగా రోజుపనికి గాను పనివానికి ప్రతి ఫలాన్ని ముట్టజెపుతూన్నాడు, యజమాని. అందు చేత 'శ్రమశక్తి'ని యితర సరుకులకు మార్చుకొనే లప్పుడు సంబంధమే యీ రెండు షిల్లింగులూ పని విస్పష్టమైనది. అనగా సదరు రెండు షిల్లింగులూ, 'శ్రమశక్తి' యొక్క 'మారకపు విలువను' తెలియ జేస్తూన్న వన్న మాట!

ఏదైనా సరుకుయొక్క 'మారకపు విలువ'ను ధనరూపములో చెప్పవలసి వచ్చి నప్పుడు, దానినే 'ఖరీదు' అని పిలుస్తాము. 'కూలి' లేక 'వేతనములు'

అంటే 'శ్రమశక్తి' యొక్క 'ఖరీదు' నకే ప్రత్యేక నామధేయము. దీనిని తరుచుగా 'పనియొక్క ఖరీదు' అనికూడ పిలుస్తారు. పనియొక్క ఖరీదునకే 'కూలి' లేక, 'వేతనము' అనేవి నామాంతరాలు. 'శ్రమశక్తి' అనే యీ విచిత్రమైన సరుకుయొక్క ఖరీదునకే 'కూలి' అని పేరు. ఈ సరుకు నుత్పత్తి చేయుగలది రక్త మాంసములతో కూడిన మానవ దేహము ఒక్కటే!

ఉదాహరణగా ఒక నేతపనివానిని తీసుకుందాము. పెట్టుబడిదారుడు వీనికి ఒక మగ్గాన్ని, కొంత నూలునూ, యిస్తూన్నాడు. నేతగాడు పనిని ప్రారంభిస్తాడు. నూలు, గుడ్డగా తయారవుతూంది. ఈ గుడ్డను పెట్టుబడి దారుడు స్వాధీనము చేసుకుని, దాన్ని యిరవై షిల్లింగులకు విక్రయిస్తా డనుకుందాము. గుడ్డను విక్రయించగా వచ్చిన యిరవై షిల్లింగులలోనూ నేతగాని వేతనములు ఒక భాగమా? తన శ్రమవల్ల తయారయిన గుడ్డలో నేతగాని కీయబడిన వేతనములొక భాగమా? ఎంత మాత్రమూ కాదు. గుడ్డ

విక్రయించ బడకుండానే, యింకా నేయు కుండానే, నేతగానికి 'కూలి' ముట్టినది. అంటే పెట్టుబడిదారుడే గుడ్డను విక్రయించుట వల్ల వచ్చిన సొమ్ములోనుండి పనివానికి కూలి యివ్వడం లేదు; అదివరకే తనవద్ద నిలవలో వున్న సొమ్ములో నుంచే 'కూలి' యిస్తూ న్నాడు. నూలు, మగ్గము మొదలైనవి పెట్టుబడిదా రుడే సప్లై చేస్తూన్నాడు. కాని నేతగాడు ఉత్పత్తి చేసినవి గావు. అట్లే అతని శ్రమశక్తికి ప్రతిఫలముగా అతనికి ముట్టిన సరుకులు కూడా [ గోధుమలు, కిరస నాయిలు, బట్టలు వగైరాలు] తనవల్ల ఉత్పత్తి చే యబడినవి కావు. గుడ్డ తయారైన తర్వాత వాటిని కొనేవాళ్ళు లేక పెట్టుబడిదారుకు నష్టపడ వచ్చును; అథవా [లేకపోతే] అమ్మినా దానివల్ల 'కూలి' యిచ్చిన డబ్బుకూడా రాకపోవచ్చును. లేదా, ఈ గుడ్డ అమ్ముట వల్ల తానిచ్చిన కూలి కంటె యెన్నో రెట్లు హెచ్చువెల రావచ్చును. కాని, వీటితో నేత పనివాని కేమీ సంబంధము లేదు! తనవద్ద అదివరకే వున్న ధనంతోనే,- [పెట్టుబడితో] పెట్టుబడిదా

రుడు 'శ్రమశక్తి' ని కొంటూన్నాడు. అట్లే మరికొంత ధనముతో పరికరాలను, అనగా ముడిసరుకులు, నూలు, మగ్గము మొదలైన వాట్లను కొంటూన్నాడు. వీటి నన్నిటినీ కొన్న తర్వాత, వాటితో గుడ్డను త్పత్తి చేయ బూనుకుంటాడు. పెట్టుబడి దారుడు, తనకు చెందివున్న ముడిసరుకుల తోనూ, పనిచేసే పరికరాలతోనూ, గుడ్డ నుత్పత్తి చేస్తూన్నాడు. ఎందుచేతనంటే, నేతపనివాడు కూడా ఒక పనిచేసే పరికరమాతుడే! ఈ సందర్భంలో మగ్గం ఎంతో, నేతగాడూ అంతే! తయారైన సరుకులోగాని, దానిని అమ్మగావచ్చే ధనంలో గాని మగ్గమునకెంత హక్కుందో, నేతగానికీ అంతే హక్కున్నది.

ఈ విధంగా, వేతనములంటే కూలి వానిచేత నుత్పత్తి చేయబడిన సరుకులో ఒక భాగము కానే కాదు. ఇదివరకే కూడబెట్టియున్న సరుకులలో ఒక భాగాన్ని పనివానికిచ్చి, ఒక నిర్దిష్టమైన శ్రమశక్తిని కొంటూన్నారు. ఈ శ్రమశక్తి చేతనే తిరిగి సరుకుల నుత్పత్తి చేయించ డానికే పెట్టుబడి దారుడు దానిని

కొంటూన్నాడు.

'శ్రమశక్తి' కూడా సరుకేనని స్పష్టమైందిగదా! దానిని కలిగియున్న పనివాడు దాన్ని పెట్టుబడి దారునికి విక్రయిస్తాడు. ఎందుకు? తాను జీవించి యుండగలగడానికే పనివాడు తన శ్రమ శక్తిని విక్రయిస్తూన్నాడు.

శ్రమశక్తి యొక్క కార్యమే 'పని'; లేక పనివాని యొక్క జీవితక్రియయే 'పని.' పనివాడు, తన జీవితావసరములైన వస్తువులను పొందగలగడానికే, దీనిని మరొకనికి విక్రయిస్తూన్నాడు. అతని జీవితక్రియయే, అతనికి యీ విధంగా జీవనోపాధిని సంపాదించుకునే సాధనం అవుతూంది. తాను బ్రతికియుండగలగ డానికే అతడు 'పని' చేస్తూన్నాడు. పనివాని జీవితములో 'పని' ఒకభాగం కానేకాదు; అతడి జీవితంలో కంతకీ అతడు చేసే 'త్యాగ మే'-'పని' అంటే! పనివానికీ, శ్రమశక్తికీగల సంబంధం ఏమిటి? తాను వేలంవేసి, విక్రయించిన సరుకుకూ తనకూగల సంబంధమే, పైరెండింటికీ వుంది. అందుచేతనే, తనుచేసే

పనికి పర్యవసానంగా జరిగే ఉత్పత్తిలో, పనివానికి భాగం లేదు. అతడి పనికి ఆదర్శం 'ఉత్పత్తి' కాదు; కేవలం 'వేతనములు' [కూలి] మాత్రమే! ఒకపని వాడు సిల్కులు నేస్తూన్నాడు; మరొకడు గనుల్లోంచి బంగారము త్రవ్వి, తీస్తూన్నాడు; యింకొకడు ఆకాశాన్నంటే మేడలు కడుతూన్నాడు. కాని, వీళ్ళందరికీ ఆ సిల్కులుగాని, బంగారముగాని, దివ్య భవనాలుగాని 'అందని మ్రాని పండ్లే'! పనివాడు యివన్నీ ఉత్పత్తిచేస్తూన్నా, అతనికి లభించేది కేవలం 'కూలి' లేక 'వేతనము' మాత్రమే! అతని విషయములో ఈ సిల్కులూ, బంగారమూ, మేడలూ,- యివన్నీ కలలోకి వలెనే కరిగి, అదృశ్యమై పోయి, పనివానికి జీవితావసరములైన బానెడు పంచ గుడ్డా, పది రాగి డబ్బులూ, చీకటి గుడిసె,- నీటి క్రింద మాడిపోతూన్నాయి. రోజుకు పన్రెండు గంటల కాలం శ్రమ చేస్తూంటే,- అనగా వడకుతూ, కంపోజు చేస్తూ, నేస్తూ, తవ్వుతూ, దోలుస్తూ, ఎత్తిపోస్తూ, రాళ్ళు బద్దలు కొడుతూ, సున్నపు తొట్టెలు మోస్తూ,

కడుతూ, యింకా యెన్నో పనులు కష్టపడి చేస్తూ వుంటే,- పనివాడు, తన జీవితములో యీ పనులు కూడా ఒకభాగమే యని కాని, వాటి ద్వారానే తన జీవితము విశదీకృత మవుతూందని గాని తలుస్తూన్నాడా? లేదు. ఎంతమాత్రమూ లేదు. ఆ యీ పనులు ఏ నిముషంలో ముగిసిపోతూన్నాయో, ఆ నిముషాన్నుంచే పనివాని యదార్థ జీవితము ప్రారంభిస్తూంది. కాఫీహోటలులో పరిచితులతోటి బాతాఖానీలూ, యింటిదగ్గర భోజనాదులూ, నిద్రపోవడమూ,- యివే ఆతడి యదార్థ జీవితానికి సంబంధించిన పనులు. పని చేయువలసిన పన్నెండు గంటల్లోనూ, ఆతడు నేత నేసినా, త్రవ్వినా, వడికినా, మోసినా, యేపని చేసినా సరే, తన యదార్థ జీవితాన్ని గడపడాని కవసరములైన వస్తువులన్నీ సంపాదించుటకు కావలసిన ధనాన్ని సంపాదించ డానికి మాత్రమే అయి వుంటూన్నాయి. కూలి- పని వాడు యీ పనులు చేసి ధనమును ఆర్జించి, తాను జీవించి యుండ డానికి అవకాశం కలిగించు కుంటున్నాడు. పట్టు పురుగు గూటిని ఎందుకు

అల్లుతూంది? తానెప్పటికీ గొంగళి పురుగుగా నుండ డానికేనా? అట్లే అయితే కూలికి పని చేసేవానికీ, గొంగళి పురుగుకూ తేడా వుండదు!

'శ్రమ_శక్తి' ఎల్లకాలం వర్తకపు సరుకుగా వుండడం లేదు. 'పని' ఎల్లపుడూ 'కూలి-పని' గానూ వుండలేదు; స్వతంత్రమైన పనిగా కూడ వుంటూంది. బానిసల విషయము తీసుకుందాము. యజమానికి, బానిస, తన శ్రమశక్తిని విక్రయిస్తూన్నాడా? లేదు. ఎద్దు తన శ్రమ-శక్తిని యజమానికి విక్రయించు తూందా? లేదు. బానిస ఒక్క సారే తన శ్రమశక్తి తోబాటు తానే యజమానికి అమ్ముడు బోతున్నాడు: ఒక యజమాని దగ్గరనుంచి మరొక యజమాని దగ్గరకు, అన్ని యితర వస్తువుల వలెనే బానిసకూడా మారుతూండవచ్చును. అంతేగాని, బానిస తన శ్రమ శక్తిని తాను అమ్ముకొనజాలడు. ఇంక జమీందారీ యుగంలో దాసుని తీసుకుందాము. దాసుడు, తన శ్రమశక్తిలో ఒక భాగాన్ని మాత్రమే విక్రయించు*

* 'విక్రయించు' అనేది యిక్కడ సరియైన పదము కాదు.

తూన్నాడు. భూ ఖామందు నుంచి దాసునికి జీత భత్యము లేమీ ముట్టవు; పై పెచ్చు దాసుడే భూస్వామికి కట్నం కానుకా యివ్వాలి. దాసుడు భూమికి సంబంధించిన వాడు [చెట్టుచేమల వలె]; భూమి భూస్వామిది; భూమిలోని ఫలాన్నంతనీ దాసుడు భూస్వామికి అందచేయాలి.

స్వతంత్రుడైన పనివాడు, తన శరీరాన్నే కొంచెం కొంచెముగా యజమానికి విక్రయిస్తూ న్నాడు. రోజుకు ఎనిమిదీ, పదీ, పన్నెండూ, పదహారూ గంటల కాలానికి తన శరీరాన్ని అమ్ముతూన్నాడు. ఎవడెక్కువ డబ్బిస్తే, వానికి తన శ్రమ-శక్తిని వేలము వేసి విక్రయిస్తూన్నాడు. పెట్టుబడి,- అంటే ముడి సరుకులు, యంత్రాదిసాధనాలూ, జీవితావసరవస్తు

---

అచ్చ మయిన దాసత్వ విధానములో భూఖామందునూ, దాసునికీ మధ్య కొనటం, అమ్మటం, అనేవే లేవు. కొంత పని రూపములోనూ, కొంత వస్తురూపంలోనూ, దాసుడు ఖామందుకు కానుక లిస్తాడు. అందువల్ల మార్క్సు యీ సందర్భంలో 'విక్రయించు' అనే పదాన్ని 'పరాధీన మొనర్చు' అనే అర్థంలోనే ఉపయోగించేను.

వులూ యెవరిదగ్గర వున్నాయో. ఆ పెట్టుబడి దారుడే పనివానిని కొంటూన్నాడు. ఇప్పుడు పనివాడు ఏదో ఒక భూస్వామికి గాని, ఏ ఒక యజమానికి గాని చెందివుండడు. ఆతనిని కొన్నవానికి, ఆతని జీవితములో ఏ యెనిమిది-పది గంటలో పని చేయవలసి వుంటుంది. తాను ఖరీదు చేసిన పెట్టుబడిదారుని తన కిష్ట మైనప్పుడల్లా వదలిపెట్ట వచ్చును; పెట్టుబడిదారుడు కూడా తన కవసరం లేనప్పుడల్లా పని వానిని తొలగించుకో వచ్చును. పనివాని వల్ల తనకు, తగినంత ప్రయోజనం కలగడం లేదని తోస్తే, యజమాని వెంటనే వానిని తొలగిస్తాడు. ఇక్కడ ఒక చిన్న కిటుకు వుంది. పని వాడు, కేవలం తన శ్రమ-శక్తిని విక్రయించడం వల్లనే బ్రతుక గలడు; ఆతనికి మరే విధంగానూ రాబడి వుండదు. అందువల్ల నాతడు మొత్తం పెట్టుబడిదార్ల నందర్నీ,- అంటే తనను కొనగల వారి నందర్నీ వదిలి పోలేడు. పనివాడు బ్రతుకు మీాద ఆశ వదలుకుంటేనే గాని యీా పని సాధ్య పడదు. ఆతడు ఏ ఒక్క పెట్టుబడి దారునకూ, ఎల్లప్పు

దూ, చెందివుండక పోయినా, ఆతని జీవిత మంతటి లోనూ, పెట్టుబడిదారీ వర్గాని కంతకీ చెందిన వాడే ను! తనను కొనగలవాని నెన్నుకునే పూచీ కూడా పనివానిదే. అంటే, పెట్టుబడిదారీ వర్గంలో, ఏ ఒక్క-ప్రత్యేక వ్యక్తి తనను కొనగలడో, పనివాడే యెంచుకుంటాడు. పనివాడు స్వతంత్రు డన్న మాటకిదే అర్థము!

పెట్టుబడికీ, కూలి-పనికీ- గల సంబంధాల్ని యింకా వివరంగా తెలుసుకునే టందుకు పూర్వము 'కూలిని' [వేతనాలను] నిర్ణయించడంలో గణనకు [లెక్కకు] వచ్చే సాధారణ సూత్రాల్ని గురించి క్లుప్తంగా చెపుతాము.

'శ్రమ-శక్తి' అనే ఒక సరుకు యొక్క ఖరీదే 'వేతనము'! ఈ విషయము యిదివరకే మనము తెల్సుకున్నాము. అందుచేత, అన్ని యితర సరుకుల యొక్క ఖరీదులూ యే సూత్రాల వలన నిర్ణయించబడుతున్నాయో, ఆ సూత్రాలే యీ 'వేతనముల'ను కూడ నిర్ణయించుతున్నాయని స్పష్ట మవుతుంది.

ఆ కారణము వల్ల మనము ముందుగా ఏదైనను ఒక వస్తువు యొక్క 'ఖరీదు' (price) యేలాగు నిర్ణయించబడు తుందా? అనేది తెలుసుకుందాము.

# కూలి-పని: పెట్టుబడి.

## మూడో ప్రకరణం.

ఏదైనా ఒక వర్తకపు 'సరుకు' యొక్క ఖరీదును నిర్ణయించడం యెట్లు?

విక్రయించే వాళ్ళకూ- కొనేవాళ్ళకూ మధ్య పోటీల వల్ల; సప్లైకీ-డిమాండుకూ మధ్యగల సంబంధం వల్ల; సరుకుల్ని యివ్వజూపు వారికీ, కొనదలచు వారికీ మధ్యగా వుండే పోటీలవల్ల; యీ పోటీయే ప్రతిసరుకు యొక్క ఖరీదును నిర్ణయిస్తూంది; ఇవి మూడు విధాలు.

ఒకేరకపువస్తువుల్ని అనేకమంది 'విక్రేతలు' అమ్మజూపుతారు. అదే రకపు వస్తువును యితరుల కంటె చౌకగా యెవరు యివ్వగలుగుదురో, ఆ విక్రేతయే యితర విక్రేతలను మార్కెటులోనుంచి తరిమి

వేసి, తన సరుకులకే యెక్కువ మంది గ్రాహకులను [కొనేవారిని] ఆకర్షించ గలుగుతాడు. ఈ రీతిగానే విక్రేతలందరూ తమ వైపుకే మార్కెటునంతా ఆకర్షించ డానికై, అంటే తామే యెక్కువగా అమ్మటానికై పోరాడుతారు. తాను అమ్మడానికీ, సాధ్యమైనంత యెక్కువ సరుకు తానే అమ్మడానికీ, వీలైతే తానొక్కడే యితర విక్రేత లందర్నీ తరిమివేసి అమ్ముకొన డానికీ,- ప్రతీ విక్రేతా ప్రయత్నిస్తాడు. అందుకే ప్రతీవాడూ యితరు లందరికన్నా చౌకగా విక్రయించాలని చూస్తాడు. ఈ రీతిగా విక్రేత లందరి మధ్యా పోటీలు బయలుదేరి, వాళ్ళ సరుకుల ఖరీదుల్ని తగ్గించడానికి పనిచేస్తూంటాయి.

కాని, గ్రాహకులలో కూడా పోటీవుంటుంది. దీనివలన అమ్మకానికి వచ్చిన సరుకుల ఖరీదులు హెచ్చడానికి కారణం అవుతూంది.

ఇంక మూడవది: చిట్ట చివరగా గ్రాహకులకూ, విక్రేతలకూ మధ్య పోటీ వుంటుంది. గ్రాహకు లందరూ వీలైనంత చౌకగా కొనాలని యత్ని

స్తారు; విక్రేతలంతా వీలైనంత ప్రియముగా అమ్మాలని చూస్తారు. గ్రాహకులు, విక్రేతలు,- వీళ్ళమధ్యగానున్న యీ పోటీలు దేనిమీద ఆధారపడి వుంటాయి? గ్రాహకుల పటాలంలో వున్న పోటీ, విక్రేతల పటాలంలోని పోటీ,- యేది బలవత్తరంగా వుంటుందో దానిని బట్టియే యీ ధరల నిర్ణయం జరుగుతూంది. పరిశ్రమలువచ్చి, యీ రెండు మహా సైన్యాల్ని రంగంలోకి యీడ్చుకు వచ్చేయి; ఈ రెండు సైన్యాల్లోనూ మళ్ళీ ఆంతరంగికంగా పోటీ లున్నాయి. అందులో ఏ సైన్యంలో పోటీలు తక్కువగా వుంటే, ఆ సైన్యం ఎదుటి సైన్యాన్ని ఓడించి, విజయాన్ని పొందుతూంది.

ఇది విస్పష్టంగా తెలిసుకోడానికి ఒక ఉదాహరణను తీసుకుందాము: మార్కెట్టులో విక్రేత లందరి వద్దనూ నూరు బేళ్ళ పత్తి ఉన్నదనుకుందాము. అదే సమయములో వెయ్యి బేళ్ళ పత్తిని కొనడానికి గ్రాహకు లున్నారు. అంటే 'సప్లై' కంటెనూ 'డిమాండు' పదిరెట్లు ఎక్కువగావుంది. గ్రాహకులలో

యీ సారి పోటీ చాల తీవ్రంగా వుంటుంది. ప్రతీగ్రాహకుడూ, ఆ వంద జేళ్ళలోనుంచి తనమటుకు ఒక్క జేలు ప్రత్తి అయినా కొనాలని ప్రయత్నిస్తాడు. ఈ ఉదాహరణ ఏదో ఉబుసు పోక యిచ్చింది కాదు. వర్తక వ్యాపారాల్లో ఎన్నో సమయాలలో ప్రత్తి కిరవు రావడం మనము చూస్తూనేవున్నాము! అటువంటప్పుడు కొంత మంది పెట్టుబడిదారులు కలిసి, మార్కెటులోని నూరుజేళ్ళను మాత్రమే గాక ప్రపంచ మంతలోనూ వున్న ప్రత్తినంతనూ కొనడానికి ప్రయత్నాలు చేస్తారు. ఇప్పుడు చెప్పుకుంటూన్న సందర్భంలో ఒక గ్రాహకుడు మిగిలిన వాళ్ళకంటె హెచ్చు ధరను పెట్టి ఆ ప్రత్తి జేళ్ళ నన్నింటినీ కొనుటకు యత్నిస్తాడను కుందాము. గ్రాహకుల్లో పోటీలు తీవ్రంగా వుండడం చూసి, విక్రేతలు తమ సరుకు విపదలము తీసుతుందనే ధీమాతో, తమలో తాము పోటీలు పడి ప్రత్తి ధరలను తగ్గించే అభిప్రాయాన్ని వదలి పెడతారు. ఒకవైపున గ్రాహకులంతా ప్రత్తి కెక్కువ ధరలను పెట్టుటవల్ల, విక్రేతలలో పోటీలు

తగ్గి, వాళ్ళందరూ ఒకే కట్టుబాటుతో ప్రశాంతంగా కూర్చుంటారు. గ్రాహకుల పటాలాని కెదురుగా విక్రేతల పటాలం ఏకీభావంతో నిల్చుని, వేదాంతుల్లాగ నిశ్చలంగా వుంటారు. గ్రాహకుల్లో యెంత తొందరపడేవాడూ కూడా ఒకపరిమితికి మించిన ధరను పెట్టడు గాని లేకపోతే యీలాంటి సమయంలో విక్రేతల ఆశకు మేర వుండకనే పోను.

అయితే, యిప్పుడు తేలిందేమిటి? ఒక సరుకు సప్లై కంటె డిమాండు ఎక్కువగా వుంది; అందువలన విక్రేతల్లో పోటీ చాలా తక్కువగా వుంటుంది; లేదా అసలేవుండదు. గ్రాహకులలో పోటీ తీవ్రంగా పెరిగి పోతూంటుంది. ఫలితంగా ఆ సరకు యొక్క ఖరీదుల్లో కొద్దోగొప్పో పెరుగుదల కనిపిస్తుంది.

ఇదేగాక, దీనికి వ్యతిరేకమైన ఫలితాలు గల సంఘటనలను కూడ తరచుగా మనము చూస్తూనే వుంటాము. డిమాండు కంటె ఎన్నోరెట్లు యెక్కువగా సప్లై వుంటుంది. విక్రేతలలో సర్వనాశనకరమైన పోటీ చెలరేగి వుంటుంది. గ్రాహకులు చాలా

తక్కువ. నమ్మజాల నంత తక్కువ ధరలో సరుకుల ను బహుకష్టం మీద విడుదల చేసుకోగలుగుతారు, విక్రేతలు.

కాని, ఒక్క ప్రశ్న. ఖరీదు హెచ్చడము అంటే యేమిటి? తగ్గడం అంటే యేమిటి? హెచ్చు ధర అంటేనూ, తక్కువ ధర అంటేనూ ఏమిటి? ఒక యిసుక రేణువును సూక్ష్మదర్శినిలో నుంచి చూస్తే పెద్దదిగా కనుపిస్తూంది; పెద్ద యెత్తైన గోపురాన్ని పర్వతంతో పోల్చి చూస్తే చిన్నదిగా కనిపిస్తూంది. అంటే యివన్నీ అన్యోన్యాశ్రియములన్న మాట! సప్లైనీ, డిమాండునూ బట్టి అన్ని వస్తువుల ఖరీదులూ నిర్ణయించబడుతూ వున్నాయి; యీ సప్లై - డిమాండులు యేటివల్ల నిర్ణయించ బడుతూన్నాయి?

ఇదిగో! ఈ పెద్దమనిషిని అడుగుదము. ఒక క్షణమైనా సందేహించకుండా, అపర చాణక్యుడులా మన మహావిషమప్రశ్నను తన అంచనాలతో టకీలున విడగొడతాడు: "నేను విక్రయించే వస్తువుల నుత్పత్తి చేయడానికి నూరు పౌనులు ఖర్చు అవుతూంది. ఆ

వస్తువులను ఒక యేడాదిలోగా 110 పౌనులకు విక్ర యించ గలిగితే, అది గౌరవప్రదమైన, సబబైన, చక్కని లాభసాటి బేరం అవుతూంది. కాని, యీ వస్తువుకే 120, లేక 130 పౌనులు లభించితే, మాంచి లాభం వచ్చినదన్న మాటే! అవే 200 పౌనులకు అమ్మితే అది అసాధారణమూ, అసమంజసమూ, అయిన లాభ మన్నమాట!" అయితే యీ పెట్టుబడి దారుడు తన లాభాల్ని యే ప్రమాణాన్ని బట్టి లెక్క పెట్టు కుంటూన్నాడు? తన సరుకుల నుత్పత్తి చేయ డానికయే మొత్తాన్ని బట్టి! ఈ విధంగా ఉత్పత్తి చేసిన సరుకును మార్చగా ఆతనికి మరొక రకపు వస్తువులు వచ్చినా యనుకుందాము. తానిచ్చిన సరుకుల నుత్ప త్తి చేయడానికైన మొత్తం కంటె, మారకంగా తన కువచ్చిన సరుకుల ఉత్పత్తికైన మొత్తం తక్కువైతే ఆ పెద్దమనిషికి నష్టం కలిగిందన్న మాట! అలాగాక, తన సరుకుకు మారుగావచ్చిన వస్తువుల ఖరీదు [వాటి ఉత్పత్తి కగు ఖర్చునుబట్టి] హెచ్చు అయితే అతనికి లాభం వచ్చినదన్న మాట! ఆతడు తన లాభ నష్టాల్ని

లెక్కించుకోవడంలో దేనిని ప్రమాణంగా తీసుకుం టూన్నాడు? తన సరుకులకైన ఉత్పత్తి ఖర్చుకంటె తనకు మార్కెటులో వచ్చిన సరుకులకగు ఉత్పత్తిఖర్చు యొక్క న్యూనతాధిక్యతల్ని బట్టి అతనికి నష్టమూ, లాభమూ, కలుగుతూన్నాయని ప్రతి పెట్టుబడిదారుడూ లెక్కించుకుంటూన్నాడు.

'సప్లై - డిమాండు'- ఈ రెండింటి యొక్క సంబంధము లోని మార్పు, సరుకుల ధరలలోని హెచ్చు తగ్గులకు కారణము అవుతూందని తెలుసుకు న్నాము; ఒకప్పుడు ధరలు తగ్గిపోవడం, మరొకప్పుడు ధరలు హెచ్చడం; యివి మనం నిత్యమూ చూస్తూనే వున్నాము. సప్లై తగ్గడం మూలమున గాని, డిమాండు మితిమీరి హెచ్చుటవల్ల గాని, ఏదైన ఒక సరుకు ధర బాగా హెచ్చినట్లైతే, మిగిలిన సరుకుల ధరలు దీనికి తగినట్లుగా తగ్గనవనే యర్థము. ఎందుచేత? ఒకసరుకు యొక్క ఖరీదు, [ధనరూపములో] దేన్ని తెలియ పరుస్తూంది? ఆ నిర్దిష్ట వస్తువుకు బదులుగా యితరవస్తువు లెన్నెన్ని, యెంతెంత వస్తూన్నాయో?

అనే 'సంబంధ సామ్యము' లేక 'నిష్పత్తి' (ratio) నే యీ 'ఖరీదు' అనేది తెలుపుతూంటుంది. ఒక్క ఉదాహరణను తీసుకుందాము. ఒకగజం సిల్కు గుడ్డ ఖరీదు రెండు నుంచి మూడు షిల్లింగులకు హెచ్చినది. అంటే వెండిధర తగ్గినదన్న మాటే కదా! [రెండుషిల్లింగులు యిస్తే వచ్చిన గజంగుడ్డా మూడు షిల్లింగులు అయిందంటే షిల్లింగుధర $\frac{2}{3}$ వంతున తగ్గిందన్న మాట] దానిని బట్టి 'షిల్లింగు' యొక్క ధరకూడా తగ్గింది. అలాంటప్పుడు యితరవస్తువుల ధరలలో మార్పు లేకపోయినా, తగ్గినట్లుగానే భావించవలసి వస్తూంది! ఒకగజం సిల్కుకు మారుగా యిదివరలో యిచ్చే పరిమాణం కంటె హెచ్చుగా యిస్తేనే కాని ఆ గజంసిల్కు యివ్వరు. ఇప్పుడు చెప్పండి. ఒక సరుకు యొక్క ఖరీదు హెచ్చినదీ అంటే దాని ఫలితాలు ఏమిటి? ఆ సరుకు నుత్పత్తి చేసే పరిశ్రమలోనికి పెట్టుబడిధనం యెక్కువగా వచ్చిపడుతుంది. ఆ పరిశ్రమలో కూడ ధరలు తగ్గి, మామూలులోనికి దిగిపోయి, దానిలో కూడ లాభాలు సర్వసాధారణ

పరిమాణంలోకి దిగేవరకూ గాని, లేదా ఉత్పత్తి మరీ హెచ్చిపోయి, ఉత్పత్తి చేయడానికగు ఖర్చు కంటె ఆ వస్తువుల ధర తగ్గిపోయే దాకా గాని, పెట్టుబడి యీ పరిశ్రమలోకి వస్తూనే వుంటుంది.

తద్వ్యతిరేకంగా, ఒకవస్తువు యొక్క ఖరీదు కంటె దాని నుత్పత్తి చేయడానికగు ఖర్చు హెచ్చినట్లైతే ఏమిజరుగుతుంది? ఆ పరిశ్రమలో పెట్టుబడిని తగ్గించుకుని, యితర పరిశ్రమలలో వినియోగించుచుకుంటారు. అంటే సదరు పరిశ్రమ క్షీణించుతుంది. అది ప్రయోజన రహిత మైనదైనాశనం కావలసినదైతే క్రమంగా నశించిపోనే పోతుంది. కొంతవరకూ ప్రయోజన సహితమైనదైతే, పెట్టుబడి తగ్గడంవల్ల ఉత్పత్తి తగ్గుతూవచ్చి, డిమాండుతో సరితూగే వరకూ దిగుతుంది. ఈ సరుకుల ఉత్పత్తి తగ్గడం వల్ల ధరలు మళ్ళీ పెరిగి, ఆ సరుకుల నుత్పత్తి చేయడానికగు ఖర్చుతో సరితూగుతుంది. లేదా యింకొకలా చెప్పాలంటే, డిమాండు కంటె సప్లై తగ్గిపోయి, ఆ సరుకుల నుత్పత్తిచేసే ఖర్చుకన్న హెచ్చు వరకూ

ఆ వస్తువు ఖరీదు పెరుగుతుంది. ఎట్లంటే, ప్రతిసరుకు యొక్క తాత్కాలికపు ఖరీదు, ఎప్పుడు చూసినా, దాని నుత్పత్తి చేయడానికగు ఖర్చుకంటె యెక్కువగానో, తక్కువగానో ఉండితీరుతుంది.

పెట్టుబడి, యేవిధంగా నిరంతరమూ ఒక పరిశ్రమలోనుంచి యింకో పరిశ్రమలోనికి ఏలా తిరుగుతూంటుందో, తెలుసుకున్నాము. ఏదైన ఒకసరుకు ధర హెచ్చితే 'పెట్టుబడి' సదరు పరిశ్రమలోకి ప్రవాహంగా వచ్చి పడుతుంది; లేక ధరలు తగ్గితే ఆ పరిశ్రమలో వుండే పెట్టుబడే బయటకు వెళ్ళిపోతుంది.

రెండో వైపునుంచి పరిశీలిస్తే, ఒక్క సప్లై మాత్రమే గాక డిమాండు కూడా సరుకు నుత్పత్తి చేయడానికగు ఖర్చుల చేత నిర్ణయించబడు తూందని నిరూపించగలను.* కాని, యివన్నీ ఆలోచించుటకు

* 'సరుకుల నుత్పత్తి చేయడానికగు ఖర్చు' అంటే చివరకు 'వేతనముల'ని యర్థము. మొత్తం 'వేతనముల' వల్లనే ప్రజల కొనుగోలు శక్తి నిర్ణయింప బడుతూంది. ప్రజల కొనుగోలు శక్తి

యిక్కడ తావుచేసు సమయంకూడా కాదు.

సప్లై - డిమాండ్లలోని హెచ్చు తక్కువలే ప్రతిసరుకుయొక్క ఖరీదునూ, దాని 'ఉత్పత్తి ఖర్చు' కు సమీపంలోకి తీసుకువస్తూన్నాయని, మనం యిప్పుడు నిరూపించియున్నాము. ప్రతిసరుకుయొక్క యధార్థమైన ఖరీదు [బజారుధర] దాని 'ఉత్పత్తి ఖర్చు' కంటె ఎప్పుడూ కూడా కొంచెం హెచ్చు గానో, తక్కువ గానో వుంటూంటుంది; కాని, యీ హెచ్చు తగ్గులు ఒకదాని కొకటి సరితూగుతూనే వుంటాయి; ఒకనిర్దిష్ట కాలంలో ఆ పరిశ్రమ యొక్క పోటుపాట్లు మొత్తంచేసి, లెక్కించి చూస్తే, ఆ వస్తువులు వాటి వాటి ఉత్పత్తి ఖర్చును బట్టియే ఒకదాని కొకటి మార్చుకోనబడుతూంటాయని స్పష్టపడుతుంది. ఈవిధంగా వస్తువుల ఖరీదులు, వాటి నుత్పత్తి చేయుట కగు

---

యే 'డిమాండు'ను నిర్ణయిస్తూంది. ప్రజల కొనుగోలు శక్తి (వేతనములు) హెచ్చితే డిమాండు హెచ్చుతుంది. వేతనములు హెచ్చుట యంటే 'సరుకుల నుత్పత్తి చేయడానికగు ఖర్చు' హెచ్చుటయే. అనువాదకుడు.

ఖర్చునుబట్టియే నిర్ణయించబడుతూన్నాయి.

ఒకవస్తువు యొక్క 'ఖరీదు' దాని ఉత్పత్తిఖర్చునుబట్టి నిర్ణీత మవుతూందని నప్పుడు, దీన్ని బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు చెప్పే అర్థంలో తీసుకోకూడదు. సరుకుల దామాషా ఖరీదులు వాటి ఉత్పత్తి ఖర్చుకు సరిపోతూం టాయని అర్థశాస్త్రజ్ఞులు చెపుతారు; ఇది ముఖ్య సూత్రమని కూడా వారి ఉద్దేశ్యం. ఖరీదుల్లో హెచ్చు-తక్కువ చేతనూ, తక్కువ-హెచ్చు చేతనూ, సరిపెట్ట బడుతూండే యీ అరాజక పరిస్థితుల్ని వారొక దైవికసంఘటనగా కూడ చెబుతూన్నారు! కాని యీ అరాజక పరిస్థితులలోని మార్పులనే ముఖ్య సూత్రం గానూ, సరుకుల ఖరీదు వాటి ఉత్పత్తి ఖర్చుచేతనే నిర్ణయించ బడుతూ వుండడమే దైవికమనీ మనం చెప్పుకోవచ్చును. ఈ రీతిగా కూడా కొందరు అర్థశాస్త్రజ్ఞులు చెపుతూనే వున్నారు. సరిగా పరిశీలించి చూస్తే, ఖరీదులలోని యీ హెచ్చు తగ్గులే భయంకరమైన వినాశక శక్తులుగా వుంటూన్నాయి. ఇవి భూకంపాల వంటివి. ఇవి, బూర్జువా

సమాజాన్నంతనూ పురాణల్లో కంటూ ఊపి వేస్తూ న్నాయి; ఇవే, సరుకుల ఖరీదుల్ని, వాటి ఉత్పత్తి ఖర్చుతో సరిపడేటట్లు చేస్తూన్నాయి. క్రమరహితమూ, అరాజకమూ అయిన యీ ఆర్థిక విధానం యొక్క మొత్తం గతిలోనే ( totality ) మనం కొంత వరకూ 'క్రమబద్ధతను' చూడగలము. ఈ పారిశ్రామిక అరాజకత్వం లోనే, యీ చక్ర పరివర్తనము లోనే, 'పోటీ' అనేది హెచ్చుతగ్గుల్ని సరితూగేటట్లు చేస్తూంది.

ఒకసరుకు యొక్క ఖరీదు, దానినుత్పత్తి చేయడానికగు ఖర్చునుబట్టి నిర్ణయించబడుతూందని, పై విధంగా తెలుసుకున్నాము. ఒకపరిశ్రమను అంతనూ, మొత్తంగా తీసుకుని చూస్తేనే యిది సరిపడుతుంది. ఒక్కొక్కప్పుడు ఒక వస్తువు ధర, దాని ఉత్పత్తికగు ఖర్చుకంటె హెచ్చినా, మరొకప్పుడు తగ్గినా, మొత్తంమీద వాటి ఫలితం సరిపోతూంటుంది. కాని, ఒక్క విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఏ పరిశ్రమ లోనైనా తయారు చేయబడిన ఒక వస్తువుకు యీ

సూత్రం వర్తించక పోయినా, ఆ పరిశ్రమ నంతటినీ ఒక్కటిగా తీసుకుని చూస్తే సరిపడుతుంది. ఆ విధంగానే యీ సూత్రము, యే ఒక్క ఉత్పత్తిదారుని విషయంలోనో సరిపడక పోయినా మొత్తం ఉత్పత్తిదారుల వర్గాన్నంతనూ తీసుకుంటే సరిగా వర్తించుతుంది.

ఉత్పత్తికగు ఖర్చు చేతనే ఒకవస్తువు యొక్క ధర నిర్ణయించబడుతుంది. అంటే, ఆ వస్తువు యొక్క ఉత్పత్తికై యెంత 'శ్రమ- కాలము' అవసరమైనదో దాన్ని బట్టే దాని ధర నిర్ణయించబడు తూందన్న మాట. ఎల్లాగ? 'ఉత్పత్తికగు ఖర్చు' అంటే యేమిటి? ముడి పదార్థాలు, పరికరముల తరుగు విరుగులు; ఇవే పారిశ్రామిక సాధనాలు: వీటి ఉత్పత్తికి కొన్నిరోజుల మానవశ్రమ అవసరం అయింది కదా-, అంటే కొన్ని గంటల శ్రమకాలం అన్నమాటే. అదిగాక యీ వస్తువు యొక్క నిర్మాణానికే ప్రత్యక్షంగా అవసరమైన 'శ్రమ' కొంత. వీటిని మనం లెక్కించాలి. అంటే ప్రతి వస్తువునూ విమర్శించి చూస్తే, అది కొన్ని

గంటల 'శ్రమ-కాలము' ను వ్యక్తీకరిస్తూంటుం దని తెలుస్తూంది!*

---

* ఉదాహరణగా ఒకటి చూద్దాం. గోనె సంచుల బేలు ఒకటి వుంది. అర్థశాస్త్రంలో అది కొన్ని గంటల శ్రమ కాలంగా లెక్కించుతాము. ఆ బేలును తయారుచేయడానికి కొంత జనప నార, మొదలైన ముడిపదార్థాలు కావాలి. ప్రకృతిపై మానవుడు కొన్ని గంటలు పనిచేయడంవల్లనే యివి తయారవుతూన్నాయి. యంత్రాది సాధనాలు, వీటి తరుగు విరుగులు,- యివి కూడా మానవశ్రమఫలితాలే. గాన దీనిని కూడా 'శ్రమ-కాలం' లోనికి మార్చవచ్చును. ఈ ముడిపదార్థాలు, యంత్రాది సాధనాలు,- యివి రెండూ కూడా 'పెట్టుబడి' క్రిందికి వస్తాయి. ఇవే గాక యీ సంచులను తయారుచేయడానికి ప్రత్యక్షంగా కూడ కొంత మానవశ్రమ అవసరం. ఇదే 'కూలి-పని.' ఇప్పుడు చూడండి. ఒక సంచుల బేలు='క'గంటల శ్రమ కాలం. ఇట్లే యే వస్తువును శోధించినా కొన్ని గంటల మానవశ్రమ అందులో యిమిడివుందని తేల్చుకోగలము. అనువాదకుడు.

## కూలి-పని: పెట్టుబడి.

### నాలుగో ప్రకరణం.

#### వేతనాలు దేనిని బట్టి నిర్ణీతము లౌతున్నాయి?

సర్వ సాధారణంగా అన్ని వర్తకపు సరుకుల ఖరీదుల్నీ యే సూత్రములు క్రమబద్ధంగా వుంచుతున్నాయో, అవే 'శ్రమ-శక్తి' యొక్క ఖరీదును [వేతనములను] కూడా ఒక నిర్దిష్టమార్గంలో వుంచుతున్నాయి. దాని యొక్క సప్లై-డిమాండులను బట్టి, వేతనములు ఒకప్పుడు హెచ్చుతూ, మరొకప్పుడు తగ్గుతూ వుంటాయి. శ్రమశక్తిని విక్రయించు పనివాళ్ళూ, దానిని కొను పెట్టుబడి దారులు,- వీళ్ళిద్దరి మధ్యను గల నిష్పత్తిని బట్టి యీ హెచ్చుతక్కువలు తటస్థించుతున్నాయి. సాధారణపు సరుకుల ఖరీదుల హెచ్చు తగ్గులతో బాటుగనే యీ వేతనము

ల్లో హెచ్చు తగ్గులు కూడా వుంటూంటాయి. కాని శ్రమశక్తి యొక్క ఖరీదు, దాని హద్దులలోనే మారుతూ, [కనిష్ట గరిష్ట ప్రమాణములలో] దాని నుత్పత్తి చేయుట కగు ఖర్చునుబట్టే నిర్ణయించ బడుతూంటుంది. 'శ్రమశక్తి' అనే యీ సరుకు నుత్పత్తి చేయుట కవసరమైన 'శ్రమకాలము' ను బట్టియే దాని ఖరీదు నిర్ణయించ బడుతూందని తెలుసుకున్నాము.

అయితే, 'శ్రమశక్తి' నుత్పత్తి చేయడానికయే ఖర్చు యెంత?

పనివాడు, పనిచేయు వాడుగా నుండ గలుగుటకును, పనిలో తరఫీదునొంది, తగుశిక్షణను బడయుటకునూ అయేఖర్చే,- శ్రమశక్తి నుత్పత్తి చేయడానికయే ఖర్చు.

అందుచేత ఒక నిర్దిష్టమైన పనిలో చేరగలుగుట కవసరమైన తరిఫీదు పొందడాని కెంత తక్కువ కాలముపట్టిన, పనివాని 'నుత్పత్తి' చేయుట కంత తక్కువఖర్చు అవుతుంది. అందుచేత అతని 'శ్రమశక్తి'

ఖరీదు [వేతనము] అంత తక్కువగా వుంటుంది. కొన్ని కొన్ని పనులు చేయడానికి తర్ఫీదు అవసరం వుండదు. అటువంటి పనులలోగాని, పరిశ్రమలలో గాని పని చేసే వానికి, ఆతడు జీవించివుండ గలగడానికీ, పని చేసేస్థితిలో వుండడానికీ అవసరమైన పదార్థాల ఖరీదును మించిన వేతనములు [పనివాని నుత్పత్తి చేయుటకగు ఖర్చు] యివ్వరు. అంటే, సాధారణపు పని యొక్క ఖరీదు, పనివాని జీవితావసర పదార్థాల ఖరీదును బట్టి నిర్ణయించబడుతూంది.

ఏదెలా వున్నా యిక్కడ యింకో విషయాన్ని మనం గుర్తించవలసి వుంటుంది. ఒక వస్తువుయొక్క ఉత్పత్తికయే ఖర్చునుబట్టి దానిఖరీదును నిర్ణయించే పెట్టుబడిదారుడు, ఆ పనిలో ఉపయోగించే యంత్రసాధనముల యొక్క తరుగు విరుగుల్ని లెక్కలోకి తీసుకుంటూ న్నాడు గదా! ఒక యంత్రము యొక్క ఖరీదు 1000 షిల్లింగులైతే, అది పది సంవత్సరాల్లో నిరుపయోగమైపోయే టట్లయితే, తయారైన సరుకుల ఖరీదుకు, యేడాదికి నూరు షిల్లింగుల

చొప్పున [యంత్రముల తరుగు-విరుగుల క్రింద] పెట్టుబడి దారుడు చేరుస్తూన్నాడు. అందువల్ల, పది సంవత్సరముల తర్వాత యీ అరిగిపోయిన యంత్రాన్ని తీసివేసి, మళ్లీ యింకో కొత్త యంత్రాన్ని పెట్టుకో గలుగు తున్నాడు. 'పని వాని' విషయం లో కూడా యింతే! 'శ్రమశక్తి' యొక్క ఉత్పత్తి కగు ఖర్చులో 'కుటుంబ వ్యాప్తి' కయే ఖర్చు కూడా చేరి వుంటుంది. ఈ పద్ధతివల్లనే 'పనివాళ్ళ' జాతి అభివృద్ధి పొందుతూ, అసమర్థులై పోయిన [వికలాంగులై, ముసలివాళ్లైన, చనిపోయిన] పనివాళ్ళ స్థానంలో కొత్త వాళ్ళను వుంచుటకు అవకాశం కలుగుతూంది. "పనివాని" యొక్క "తరుగు విరుగులు" [అంగవైకల్యము, రోగములు, ముసలితనము] యంత్రాల యొక్క తరుగువిరుగులు వలెనే గణించబడుతూన్నాయని యిందువల్ల విస్పష్టమవుతూంది.

ఈ రీతిగా పనివాని యొక్క జీవిత భృతికీ, వాని వంశాభి వృద్ధికీ కావలసిన ధనమే, సామాన్యముగా 'శ్రమశక్తి' యొక్క ఉత్పత్తి కగు ఖర్చుల మొ

త్తమని తెలుసు కున్నాము. ఈ మొత్తాన్నే 'వేతన ము' లని చెపుతాము. ఈ విధంగా నిర్ణయించ బడే వేతనాన్నే 'కనీస వేతనము' లంటారు. ఇతరవస్తువుల ఖరీదులన్నీ వాటి ఉత్పత్తికగు ఖర్చుల్నిబట్టి నిర్ణయిం చబడు తూన్నట్లే, ఈ కనీస వేతనములు కూడ నిర్ణ యించబడు తున్నాయి. ఇవి, ఏ ఒక్క పనివాని విష యమో చూస్తే వర్తించక పోవచ్చును గాని, పని వాళ్ళ వర్గాని కంతకూ మొత్తంమీద చూస్తే సరిప డతాయి. లక్షలకొద్దీ పనివాళ్ళు తమజీవితాల్ని నిలు పుకోడానికీ, తమ కుటుంబాల్ని పోషించు కోడాని కీ సరిపడే వేతనాలు కూడా లేక ఘోషిస్తూనే వు న్నారు. కాని, ఒక పరిశ్రమను గాని, ఒక దేశాన్ని గాని తీసుకుని చూస్తే, హెచ్చు తగ్గుల రోజుల్లో కూడా, పనివాళ్ళందరి వేతనాల యొక్క సగటు మొ త్తం యీ కనీస వేతనానికి సరిపడుతూనే వుంటుంది.

మనం, ఇప్పుడు, వేతనాల్ని నిర్ణయించుతున్న సామాన్య సూత్రాల్ని తెలుసు కున్నాము. అంతే గాకుండా యితర వస్తువుల ఖరీదుల్ని నిర్ణయించే

సూత్రాల్ని కూడా తెలుసుకున్నాము. అందుచేత మనం ముందు విషయాల్ని సులభంగా తెలుసుకో గలము.

పంచాయతీ
వేమన గ్రంథాలయం,
తేలప్రోలు కూర్పు-పేని: పెట్టుబడి.

## ఐదో ప్రకరణం.

### పెట్టుబడి యొక్క స్వభావమూ, అభివృద్ధీ.

పెట్టుబడి అంటే యేమిటి? ముడిపదార్థాలు, యంత్రాది పరికరాలు, జీవితావసరములైన అన్ని రకముల వస్తువులు, మొదలైనవన్నీ కలిసి పెట్టుబడి అవుతాయి. నూతనమైన ముడిపదార్థాలను, పనిముట్లను, జీవితావసర వస్తువులను ఉత్పత్తి చేయడంలో, యీ 'పెట్టుబడి' నుపయోగిస్తారు. పెట్టుబడి యొక్క యీ వివిధాంగములూ కూడా 'పని' వల్లనే తయారు చేయబడుతూన్నాయి. అంటే మానవుని శ్రమ యొక్క మారు రూపములే యివన్నీ [కరడు గట్టి, పదార్థరూపంలో వున్న మానవశ్రమ]; తిరిగి వస్తూత్పత్తికై ఉపయోగింపబడే 'సంచిత మానవశ్రమ' నే అర్థశాస్త్రజ్ఞులు 'పెట్టుబడి' అంటారు. 'నీగ్రో బానిస' అంటే యేమిటి? నల్లటి రంగుజాతులకు

పొందిన ఒకమనిషి. ఒకవిషయాన్ని స్పష్టంచేస్తే, రెం డోది దానంతట దే స్పష్టంగా తెలుస్తుంది.

నీగ్రో అంటే నీగ్రోయే. కేవలమూ కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో వుంటేనే అతడు 'బానిస' అవుతూన్నాడు. 'నూలువడకు యంత్రం' 'పెట్టుబడిదాకీ యంత్రం' అవుతోంది. కాని, ఈ ఆర్థికపరిస్థితుల్లోంచి తొలగిస్తే, ఆ యంత్రమే, 'పెట్టుబడి దాకీ యంత్రం' గా వుండడం మానేస్తుంది! బంగారపుముద్ద ఒకచోట పడివుంటే అది ధనం కానట్లే,- పంచదార యెంత వున్నా దానిఖరీదును 'పంచదార లోనే' యెల్లాపు చ్చుకోమో,- అల్లే, దాని పరిసర పరిస్థితుల్లోంచి తొలగిస్తే అదే యంత్రం 'పెట్టుబడి దాకీయంత్రంగా' వుండడం మానేస్తుంది.

ప్రకృతిలో పనిచేయుటవల్ల మానవుడు, తన అవసరములు ఉత్పత్తి చేస్తూన్నాడు. అంతేగాక, మానవులు తమలో ఒకరొకరి కొరకు కూడా పనిచేస్తు న్నారు. ఒక నిర్దిష్ట విధానములో చాలమంది కలసి పనిచేయడం వల్లనూ, తమరు ఉత్పత్తి చేసిన పదార్థా

ల్ని పరస్పరమూ మార్చుకొనుట వల్లనూ, మానవులు వస్తూత్పత్తిని కొనసాగిస్తూన్నారు. సరిగా ఉత్పత్తి చేయగలగ డానికై ఒక రోకరితో నిర్దిష్ట సంబంధములనూ, నియమములనూ పెంపొందించు కుంటారు. ఈ సామాజిక, ఆర్థిక నియమాలను హద్దు మీరకుండా వుంటేనే ప్రకృతిమీద మానవుల ప్రభావము చెల్లుతుంది. అంటే వస్తూత్పత్తి చేసుకో గలుగుతారు.

ఉత్పత్తిదారులలోని యీ సంబంధములూ, నియమాలూ,- ఉత్పత్తి సాధనములతో బాటు నిరంతరం మారుతూనే వుంటాయి. నూతనంగా 'తుపాకి' కనిపెట్టబడినప్పుడు సైన్యాల అంతర్నిర్మాణ వ్యవస్థ అంతా కూడా పూర్తిగా మార్పు జెందింది; ఒకే సైన్యములోని వ్యక్తి సైనికుల యొక్క, వివిధ సైన్యాలయొక్క సంబంధములూ, నియమములూ కూడా మార్పుల్ని బొందినాయి.

ఈ విధంగా, వ్యక్తులు ఉత్పత్తిని కొనసాగించుట కవకాశ మిచ్చిన సామాజిక సంబంధాలు,

ఉత్పత్తి పరికరాలు మారడంతోనూ, అభివృద్ధి జెందడంతోనూ మారుతూ, రూపాంతరం బొందుతూ వచ్చేయి. అంటే, సామాజికోత్పత్తి సంబంధాలు, ఉత్పత్తి శక్తులతో బాటుగా మారుతూ, రూపాంతరాలు బొందుతూ వస్తూన్నాయి. ఒక సమాజంలోని ఉత్పత్తి సంబంధాల మొత్తాన్నే 'సామాజిక సంబంధము' లని అర్థశాస్త్రజ్ఞులు వ్యవహరిస్తూన్నారు ప్రతి సమాజమూ, అందులోనూ చారిత్రకంగా ఒక ప్రత్యేక దశలోవున్న సమాజం, యీ సంబంధాలనే వ్యక్తీకరిస్తూంది. పురాతన సమాజము, జమీందారీ సమాజము, బూర్జువా సమాజము,- యివన్నీ కూడా మానవజాతి యొక్క చరిత్రలో ఒక్కొక్క పరిణామ దశను తెలియ జేస్తూన్నాయి.

'పెట్టుబడి' అనేది కూడా సామాజికోత్పత్తి సంబంధములలో నొకటి. బూర్జువా సమాజంలోని ఉత్పత్తి సంబంధాన్నే 'పెట్టుబడి' అంటున్నాము. జీవితావసర వస్తువులు, యంత్రాది పరికరాలు, ముడిపదార్థాలు,- వీటి నన్నిటినీ కలిపి 'పెట్టుబడి' అంటూ

న్నారని యిదివరకే తెలుసుకున్నాము. నిర్దిష్టమైన కొన్ని సామాజిక సంబంధముల లోపల, కొన్ని సామాజిక నియమాలకు లోబడే యీ 'పెట్టుబడి' అనేది జన్మించి, అభివృద్ధిలోకి వచ్చింది; వాటికి లోబడివుండే, యిది తిరిగి నూతన వస్తునిర్మాణం చేస్తూ వుంది. అంతేగాక, నూతన వస్తూత్పత్తి కుపయోగించబడు తూన్న యీ వస్తువుల్ని ప్రస్తుత బూర్జువా సమాజ స్వభావమే 'పెట్టుబడి' గా చేసివేసింది.

జీవితావసర వస్తువులు, యంత్రాది పరికరములు, ముడి పదార్థములు, మొదలైన భౌతిక పదార్థములు గాని, వాటికి సమానముగు 'మారకపు విలువలు' గాని 'పెట్టుబడి' అని తెలుసుకోవాలి. ఏ ఏ వస్తువులు కలిస్తే పెట్టుబడి అవుతూందో, ఆ వస్తువులన్నీ కూడా వర్తకపు సరుకులే. అందుచేత, పెట్టుబడి అంటే కేవలం కొన్ని భౌతిక పదార్థాల సముదాయం మాత్రమే గాదు. అది కొన్ని వర్తకపు సరుకుల, అనగా మారకపు విలువగల పదార్థాల, అనగా సామాజిక పరిమాణమును (social magnitudes)

తెలుపు వస్తువుల సముదాయమని తేలుతూంది. ప్రత్తికి బదులుగా ఉన్ని వుంచినా, ధాన్యానికు బదులు గోధుమల నుంచినా, రైలు మార్గాలకు బదులుగా పొగఓడలను నిర్మించినా,- పెట్టుబడి- పెట్టుబడిగానే వుంటుంది. ఒకచోట ప్రత్తి, ధాన్యం, రైలు రోడ్లు మొదలైనవి పెట్టుబడి అవుతూన్నాయి. ఉన్ని, గోధుమలు, ఓడలు,- యివి రెండో చోట పెట్టుబడి అవుతూన్నాయి. వీటి కన్నిటికీ మారకపువిలువలు సమానమే అయినంత వరకూ, 'పెట్టుబడి' మాత్రం మారదు. 'పెట్టుబడి' యొక్క బాహ్యభౌతిక రూపాలు నిరంతరమూ మారుతూన్నా, 'పెట్టుబడి' యొక్క స్వభావం మాత్రం కొంచెం కూడా మార్పు పొందకనే వుండవచ్చును.

ప్రతీ సందర్భం లోనూ, కొన్ని వర్తకపు సరుకుల మొత్తమే పెట్టుబడి అవుతూంది. అంటే పెట్టుబడి యెప్పుడూ కొన్నిమారకపు విలువల మొత్తమే. అయినా కానీ ప్రతి సందర్భంలోనూ కొన్ని మారకపు విలువల, లేక వర్తకపుసరుకుల మొత్తంమాత్రం

'పెట్టుబడి' కానక్కర లేదు. [ప్రతీ దొంగా కూడా మనిషే; కాని, ప్రతీ మనిషీ దొంగ మాత్రము కాజాలడు.]

కొన్ని మారకపు విలువల [వస్తువుల] మొత్తం కూడా ఒక మారకపు విలువే. ప్రతి మారకపు విలువయు కొన్నిమారకపువిలువల మొత్తమే. ఉదాహరణగా: 1000 పౌనులు చేసే ఒకయిల్లు యొక్క మారకపు విలువ 1000 పౌనులు; ఒకషిల్లింగు చేసే వస్తువు విలువ, పెన్నీ ఖరీదుచేసే వస్తువులు పన్నెండింటి యొక్క మారకపు విలువతో సమానం. పరస్పరం మారకం చేసికొనుట కుపయోగించే వస్తువులన్నీ 'వర్తకపు సరుకులే'. అవి ఒకదాని కొకటి, ఏ యే వంతులుగా మార్చుకోబడు తూన్నాయో ఆ మొత్తమే దాని 'మారకపు విలువ' అవుతూంది. ఈ 'మారకపు విలువనే' ధనరూపంలో చెప్పవలసి వచ్చే టప్పటికి 'ఖరీదు' అంటారు. ఒకవస్తువు, వర్తకపు సరుకుగా వుంటూందా? లేదా? అనే దానిని, ఆ వస్తువు యొక్క పరిమాణం నిర్ణయించ లేదు. ఒక

వస్తువు యొక్క పరిమాణం ఎంతవున్నా సరే, దాని కొక మారకపువిలువ, లేక ఖరీదు వుండి తీరుతుంది. పెద్దదవనీ, చిన్నదవనీ, చెట్టు చెట్టే. ఇనుము యితర సరుకులకై మార్చుకొనే టప్పుడు తులాల లెక్కను మార్చుకున్నా, టన్నులలెక్కను మార్చుకున్నా, దాని స్వభావాన్ని మాత్రం మార్చ లేదుకదా! పై రెండు సందర్భాల్లోనూ యినుము, వర్తకపు సరుకు. దానికొక మారకపు విలువ, లేక ఖరీదు వుంది. పరిమాణాన్ని బట్టి నిర్ణయించబడేది, దాని మారకపు విలువ లేక ఖరీదు మాత్రమే.

అయితే, ఒక మొత్తంగల వర్తకపు సరుకులు, మారకపు విలువలు,- పెట్టుబడిగా యెట్లు అవుతూ న్నాయి?

సమాజంలో ఒకస్వతంత్ర శక్తిగా అంటే ఒక వర్గంయొక్క శక్తిగా నిలువదొక్కు కొని, జీవించి యున్న శ్రమ- శక్తి [ప్రత్యక్ష శ్రమశక్తి] తో మారకం వల్లనే 'పెట్టుబడి' వృద్ధి బొందుతూంది.

ఈ పెట్టుబడి, బయలుదేరి, వృద్ధి పొందా

అంటే పనిచేసే శక్తి తప్ప మరే యితర ఆస్తిపాస్తులూ లేని జనసంఘం కొంత వుండాలి.

ప్రత్యక్షంగా జీవించియున్న శ్రమమీాద పదార్థ రూపంలోవున్న [భూతపూర్వమూ, సంచితమూ] శ్రమ యొక్క ఆక్రమణయే,- యీ సంచిత శ్రమకు 'పెట్టుబడి' యొక్క స్వభావ లక్షణాల్ని యిస్తూంది.

నూతన వస్తూత్పత్తికై ప్రత్యక్ష శ్రమకు, సంచితశ్రమ తోడ్పడుతూందీ అంటే దానిని 'పెట్టుబడి' అనజాలము. సంచితశ్రమ, పెట్టుబడిగా యే పరిస్థితుల్లో అవుతూంది? సంచిత శ్రమయొక్క ఉనికికీ, దాని మారకపు విలువను ఎన్నోరెట్లు హెచ్చించ డానికీ, ప్రత్యక్ష శ్రమ తోడ్పడు తూన్నప్పుడే అది 'పెట్టుబడి' గా అవుతూంది!

# కూలి-పని: పెట్టుబడి.

## ఆరో ప్రకరణం.

### కూలి- పనికీ, పెట్టుబడికీ గల సంబంధము.

కూలి- పనివాడు తన శ్రమశక్తిని పెట్టుబడి దారునికి మార్చుకోడంలో జరుగుతూన్నది, ఏమిటి?

పనివాడు తన శ్రమ- శక్తికి బదులుగా జీవితావసర వస్తువుల్ని పొందుతాడు; కాని, పెట్టుబడి దారుడు తానిచ్చే వస్తువులకు మారుగా పనిని లేక పనివాని వద్దనున్న వస్తూత్పాదక చాతుర్యాన్ని ( productive activity ) తీసుకుంటూన్నాడు. ఇందు మూలంగా పనివాడు, తాను వినియోగించుకున్న వస్తువులను యథారీతిగా పూర్తిచేయడమే కాకుండా, 'సంచితశ్రమ' కు [పెట్టుబడికి] అదివరలో దానికున్న విలువకంటె అధికమైన విలువను కలిగిస్తూ.

న్నాడు. పెట్టుబడి దారునివల్ల పనివాడు పొందుతూ న్న జీవితావసర పదార్థాలెందుకు ఉపయోగపడతూ న్నాయి? అతడు తాత్కాలికంగా వాడుకోడానికే! కాని, వాటిని వాడుకొనగానే అవి, పనివానికి లేనివే అవుతూన్నాయి. ఈ పదార్థాలు అతనిలో పనిచేయ గల శక్తిని నిలిపివుంచుతున్నాయి. ఆ శక్తి వుండగా నే పనివాడు తిరిగి తనకవసరమగు వస్తువుల్ని [వేతన ములను] ఉత్పత్తి చేయాలి. అతడు వాడుకున్న పదా ర్థాలస్థానే నూతన విలువల్ని [వస్తువులను] సృష్టించ కపోతే అవి, పనివానికి లేనివే అవుతాయి. కాని, పని వాడు తాను తీసుకున్న వస్తువులకు మారుగా పెట్టు బడి దారునికి, యీ వుత్తమ శక్తినే, పునరుత్పాదక శక్తినే స్వాధీనపరుస్తూన్నాడు. అందుచేత అది కూ లి- పనివానికి వున్నా లేనిదే అవుతూంది!

ఒక ఉదాహరణను తీసుకుందాము: ఒక పని వాడు, ఒక షిల్లింగు తీసుకొని, రైతు పొలములో పనిచేసి, రెండుషిల్లింగుల విలువగల ప్రతిఫలాన్ని ఉత్పత్తి చేస్తాడు. ఈ రీతిగా రైతు, తానిచ్చిన కూలికి

రెండింతలు ప్రతిఫలాన్ని పొందుతూన్నాడు. అనగా రైతు, కూలీపనివాని కిచ్చే మొత్తమును 'రాబడి తెచ్చేటందుకే' [పునరుత్పాదకంగా] ఖర్చుపెడుతూన్నాడన్న మాట! ఒక షిల్లింగుయిచ్చి కూలి- పనివాని యొక్క 'శ్రమ-శక్తి'ని కొని, దాని వలన భూమి నుంచి రెండుషిల్లింగుల విలువగల సరుకుల నుత్పత్తి చేయించు కుంటూన్నాడు. పర్యవసానంలో, రైతు, ఒక షిల్లింగును రెండుగా చేసుకో గలిగేడు. తన ఉత్పాదక శక్తిని రైతుకిచ్చి, ఒకషిల్లింగు తీసుకుని, దానితో తన జీవితావసర వస్తువులు కొనడానికై ఖర్చు చేసుకుంటూన్నాడు. ఈ మాదిరిగా ఒక షిల్లింగే యిద్దరికీ, రెండు విధాలుగా ఫలాన్ని యిచ్చింది. పెట్టుబడిదారునికి పునరుత్పాదకంగానూ, [అంటే శ్రమ శక్తిని కొని, రెండు షిల్లింగుల విలువగల వస్తువుల నుత్పత్తి చేయించు కొనడంలో]; పనివానికి అనుత్పాదకంగాను [శ్రమశక్తి నిచ్చి, జీవితావసరాల్ని తీసుకొని, వాటిని వాడుకొని తిరిగి రిక్తుడవుతున్నాడు.] పనివాడు యీ షిల్లింగును తిరిగి పొందాలంటే యీ

రీతి మారకాన్నే రైతుతో చేసుకోవలసేవుంటుంది. 'పెట్టుబడి' బయలుదేరాలీ అంటే 'కూలి-పని' వున్న దనే అర్థం. ఈ రెండింటిలోనూ యే ఒకటున్నా రెం డోది వున్నదన్న మాటే! ఒకటి, రెండో దానికి అస్థి త్వాన్ని యిస్తూంది.

ఒక ప్రత్తి ఫ్యాక్టరీ ఉన్నదనుకోండి. దానిలో పనిచేసేవాడు వేటిని ఉత్పత్తి చేస్తూన్నాడు? ప్రత్తి వస్తువులనా? కాదు! ఆతడు పెట్టుబడి నుత్పత్తి చేస్తూ న్నాడు. అంటే ఆతడు 'విలువ' ల నుత్పత్తి చేస్తూ న్నాడు. అవి తిరిగి పనివానినుంచి పనిని తీసుకుని, దా నిద్వారా మళ్ళీ నూతనంగా 'విలువ' లను ఉత్పత్తి చేస్తూన్నాయి!

పెట్టుబడి నిచ్చి శ్రమ-శక్తిని తీసుకుంటూ న్నారు. ఈ మారకం మూలాన్నే, పెట్టుబడి పెరుగు తూంది. ఈ మారకంలోనే, కూలి-పనివాని యొక్క శ్రమశక్తి, పెట్టుబడిని పెంచుతూంది. ఏ శక్తి తనను బానిసగా చేసిందో, దానినే శ్రమ-శక్తి బలపరుస్తూ వుంది! 'పెట్టుబడి' అభివృద్ధిజెందుతూందంటే శ్రామిక

వర్గం కూడా అధిక విస్తృతమైనదిగా అవుతూన్నదన్న మాటే.

ఇందువల్లనే కాబోలు బూర్జువాలూ, బూర్జువా అర్థశాస్త్రజ్ఞులూ కూడా కూలిపని వాని యొక్క, పెట్టుబడి దారునియొక్క ప్రయోజనాలు ఒకటే! అని అంటూంటారు! ఆలోచిస్తే దీనిలో యథార్థం లేకపోలేదు! పెట్టుబడి దారుడు, పనివానికి పని చెప్పకపోతే పనివాడు మాడిపోతాడు. శ్రమశక్తిని దోచుకోకపోతే [పని చేయించుకుంటేనే యీ దోపిడీ సాగుతుంది.] పెట్టుబడి, తానే నాశనమై పోతుంది. ఉత్పాదక పెట్టుబడి యెంత త్వరగా పెరుగుతూ వుందో, అంత అభివృద్ధిలో వుంటాయి, పరిశ్రమలు; బూర్జువావర్గం అంత అధిక ధనాఢ్యమైన దవుతూంటుంది; వ్యాపారం కూడా చాల అభివృద్ధిలో వుంటుంది; కూలీలు యెక్కువ మంది కావలసివస్తారు; కూలి-పని వాళ్లు, తమ శ్రమను ప్రియంగా అమ్ముకో గలుగుతారు, ఈ కారణం వల్లనే, ఉత్పాదక పెట్టుబడి అభివృద్ధి దశలో వున్నప్పుడే పనివాళ్ళ జీవితం కొంత

వరకైనా సహించ దగినదిగా వుంటుంది.

కాని, ఉత్పాదక పెట్టుబడి యొక్క అభివృద్ధి అంటే ఏమిటి? సజీవమగు శ్రమమీద 'సంచితశ్రమ' [పెట్టుబడి] యొక్క అధికారం పెరగడమన్న మాట. పనివాళ్ళ మీద బూర్జువా వర్గం యొక్క ప్రభావం హెచ్చు పెరగడ మనే, దీని అర్థం! 'కూలి-పని' తనను పీడించి, దోచుకునే విరోధికే సంపదలను సమకూర్చి పెడుతూన్నపుడు; తాత్కాలికోపయోగానికై జీవితావసర పదార్థాలను తీసుకుని, తనను శాసించే శత్రువుకు [పెట్టుబడికి] మరికొంత అదనపు విలువను చేర్చు షరతులపై పనిచేస్తూ, ఆ శత్రువే మరింత అభివృద్ధి పొందుటకు తగిన అవకాశాల్ని కల్పించు సాధనం అవుతూంది.

పెట్టుబడిదారుని యొక్కా, పనివానియొక్కా ప్రయోజనాలు ఒకటే' అనేమాటకు అర్థం యేదైనా వుందీ అంటే, యిదే. ఒకే ఒక ఆర్థిక సంబంధానికే పెట్టుబడి, కూలి-పని, అనేవి రెండూ రెండుముఖాలు వడ్డీవ్యాపారి, అప్పు తీసుకునే వాడూ, ఒకరి కొకరు

షరతు లేర్పరచు కుంటూన్నట్టే 'పెట్టుబడి: కూలి పని' కూడా ఒకదాని కొకటి నియమాల్ని విధించు కుంటూన్నాయి.

ఎంతవరకూ కూలి - పనివాడు, కూలి - పనివాడుగానే వుంటాడో, అంతవరకూ ఆతడు పెట్టుబడి దారుని మీాదనే ఆధారపడి వుండాలి. ఈ యిద్దరి ప్రయోజనాలూ ఒకటే నని చెప్పే మాటలకు పర్యవసానంలో వేరే అర్థం లేనేలేదు.

పెట్టుబడి అభివృద్ధి చెందినట్లైతే, కూలి - పని కూడా పెరుగుతుంది. అంతకంత కధికసంఖ్యాకులగు కూలి - పనివాళ్ళను, 'పెట్టుబడి' తన అధికారంకింద కు తెచ్చుకుంటుంది.

మనం యీా వాదనకు అనుగుణ్యంగా చెప్పదగిన దొక్కటే! ఉత్పాదక పెట్టుబడి పెరిగితే, పనికి గిరాకీ తగులుతుంది. అందు మూలంగా శ్రమశక్తి యొక్క ఖరీదు, అంటే వేతనాలు పెరుగుతాయి.

ఒక యిల్లు వుందనుకోండి. అది పెద్దదీ కావచ్చును; చిన్నదైనా కావచ్చును. కాని దాని చుట్టు

పక్కలనున్న యిండ్లన్నీ కూడా దానితో సమాన మైనవిగానే వున్నంతవరకూ అదికూడా నివాసార్హమైనదిగానే వుంటుంది. ఎవరైనా నివసించడానికి అవసరమైన సామాజిక నియమాల్ని ఆ యిల్లు పూర్తిచేస్తూందన్న మాట! దాని ప్రక్కనే బ్రహ్మాండమైన రాజభవనం ఒకటి బయలుదేరిందనుకోండి. ఈ చిన్న యిల్లు, చూసేవాళ్ళకి చిన్నపంపుల గుడిసెగా కనుపిస్తుంది. ఆ యిల్లు చూడడంతోనే అంతా యేమనుకుంటారు? ఆ యింటి యజమానికి సామాజికంగా హొదాయే లేదనీ, ఆతని స్థితి చాలా లాఘవమైనదనీ తెలుసుకుంటారు. నాగరికత వృద్ధి పొందుతూ, ఆ గుడిసె కూడా క్రిమంగా పెద్ద యిల్లుగా మారినా, ప్రక్కనున్న రాజభవనం కూడా దీని కనుగుణ్యంగా పెరిగినట్లైతే [దీనితోబాటు గానీ, లేక యెన్నోరెట్లుగానీ] ఆ చిన్న గృహస్థుని స్థితి యేలా వుంటుంది. తన యొక్క అప్రాముఖ్యతను నిరంతరం తలుచుకుని, అసంతుష్టుడూ, అసౌఖ్యవంతుడూ, అవుతూనే వుంటాడుగదా!

అట్లే యిక్కడకూడా. వేతనములలో తగినంత పెరుగుదల కనిపించిదంటే, వుత్పాదక పెట్టుబడి హెచ్చినదనే అర్థము. సంపదల యొక్క, ఉత్పాదక పెట్టుబడి యొక్క సత్వరాభి వృద్ధియే, భోగములను, సామాజికావసరములను, సామాజిక సంపదలను, విలాసములను కూడా నిరంతరం, సర్వతో ముఖాభి వృద్ధిలోకి తీసుకొని వస్తుంది. అందుచేతనే సామాన్య పనివాని యొక్క విలాసాదులు హెచ్చినా కానీ, దానివల్ల ఆతనికి కలుగుతూన్న విలాసానుభవం, పెట్టుబడి దారుల భోగాలతో పోల్చిచూస్తే చాల తక్కువ స్థాయిలోనే వుండిపోతుంది. పెట్టుబడి దారుల భోగాలు కూలీలకు సాధ్యంకాకపోయినా, సమాజం మొత్తంమీద చూసినా కూలీల అనుభూతి చాల కొంచమే అవుతూంది. మానవుల కోరికలూ, అవసరాలూ, విలాసాలూ, వాంఛలూ,- వీటన్నిటికీ మూలం ఎక్కడుంది? సమాజంలోనే! అందుచేత ఒకకూలివాని అనుభవాల్ని, అప్పటి సమాజం యొక్క విలాసాల్నిబట్టి చూస్తాము. అంతేగాని యీ విలాసాల్ని సమ

కూరుస్తూన్న వస్తు సముదాయాన్ని లెక్కించము. ఈ భోగవిలాసాలు సామాజిక స్వభావం గలవి; గనుకనే 'సాపేక్షక సంబంధము' (relative nature) గలవిగానే వుండితీరుతాయి.

వేతనములకు బదులుగా మారకంలో వచ్చే వస్తువుల మొత్తం చేతనే అవి నిర్ణయించ బడుతూన్నాయా?

16 వ శతాబ్దములో, యూరపు ఖండంలో వెండి బంగారముల యొక్క మారకము హెచ్చుపెరిగిపోయింది. అమెరికాలో వెండి, బంగారు గనులు విరివిగా దొరకడం, బంగారమును తీయడంలో సౌలభ్యం కలగడం,- యివే అందుకు కారణాలు. అందుచేత, యితరసరుకుల ధరలతో పోల్చిచూస్తే, వెండి బంగారముల ధరలు దిగిపోయినాయి. కూలి- పనివాళ్లు, అదివరకు మాదిరిగానే, అదే మొత్తంగల వెండి నాణెములను తమ శ్రమశక్తికి బదులుగా పొందేవాళ్ళు. అంటే, శ్రమశక్తి యొక్క విలువ, ధనరూపంలో ఒకటిగానే వున్నా, వాళ్ళ 'వేతనాలు' తగ్గిపోయిన వనే

అర్థం. ఎందువల్ల? అదే మొత్తంగల వెండికిబదులుగా కూలి - పనివానికి లభించే జీవితావసర పదార్థాల మొత్తం తగ్గిపోయింది కనుక. ఈ పరిస్థితుల వల్లనే, 18వ శతాబ్దంలో పెట్టుబడియొక్క అభివృద్ధికీ, బూర్జువా వర్గంయొక్క అభివృద్ధికీ గొప్పఅవకాశం కలిగింది.

మరో ఉదాహరణ తీసుకుందాం: 1847 సంవత్సరం శీతకాలంలో, పంటలు చెడిపోవడం కారణంగా జీవితముఖ్యావసరములైన ధాన్యం, మాంసము, వెన్న, జున్ను మొదలైన పదార్థాల ధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. పనివాళ్లు, పూర్వపు జీతాల్నే పొందుతూన్నారనుకుందము. వాళ్ళ వేతనాలు పడిపోయినట్లేనా? నిస్సందేహంగా వేతనాలు తగ్గినవనే చెప్పాలి. అదే మొత్తానికి వాళ్ళ కిదివరకు వచ్చే దానికంటె తక్కువగా యీ పదార్థాలు లభిస్తాయి గనుక. ఈ సందర్భంలో వేతనాలు తగ్గుటకు కారణం వెండిధర తగ్గడంకాదు. జీవితావసర వస్తువుల ధరలు పెరుగుటవల్లనే పనివాళ్ళజీతాలు తగ్గినవని చెప్పాలి.

తద్వ్యతిరేకంగా మంచి పంటలు పండుటవ

ల్లా, నూతన యంత్రాలతో ఉత్పత్తి జోరుగా సాగుటవల్లా వ్యావసాయిక, పారిశ్రామిక వస్తువుల ధరలు మందంగా వున్నా యనుకుందము. అదే సమయంలో పనివాళ్ళ వేతనాలు యధాస్థితిగానే వుండి పోయినాయి. అదే ధనంతో యెక్కువ వస్తువుల్ని పనివాళ్లు కొనుక్కోగలుగుతారు. అందుచేతనే వాళ్ళ వేతనాలు హెచ్చినవని యర్ధము. ఎందువల్ల? వస్తువుల ఖరీదులు తగ్గినవే గాని, శ్రమశక్తి యొక్క ఖరీదులో [వేతనములలో] మార్పు కలుగలేదు గనుక.

శ్రమశక్తి యొక్క విలువలు ధనరూపంలోనూ, వస్తురూపంలోనూ వేరువేరు అవుతూన్నాయి. ఒకే సమయంలోనే యీ రెండూ, అంటే నామకః లభించే వేతనాలూ, యధార్ధ వేతనాలూ ఒకటిగా వుండడం లేదు. అందుచేత వేతనాలు పెరిగినవని గాని, తగ్గినవని గాని చెప్పేటప్పుడు మనము శ్రమశక్తి యొక్క ధనపు విలువనే గాక యధార్ధ వేతనాల్ని [ఆ డబ్బుకు అతనికి లభించే వస్తువులు] కూడా మనసులో వుంచుకోవాలి.

పనివాడు తనను పెట్టుబడిదారుని కెంత మొత్తానికి విక్రయిస్తూన్నాడో అదిన్నీ, యథార్థ వేతనాలున్నూ [ఆడబ్బుతో పనివాడు పొందగల వస్తువులు],- యీ రెండే 'వేతనాలు' అనే మాటలో వున్న సంబంధాన్ని పూర్తిగా తెలుపలేవు.

వేతనాలను నిర్ణయించే దింకొకటి కూడా వుంది. పెట్టుబడి దారునికి వచ్చేలాభం,- దీనినిబట్టి 'వేతనాలు' వుంటాయి. అందుచేతనే వేతనాలు 'సాపేక్షిక' మైనవని చెప్పడం!

యథార్థవేతనాలు, శ్రమశక్తి యొక్క ఖరీదును, యితరవస్తువుల ఖరీదులతో పోల్చి, వాటి సంబంధాన్ని తెలుపు తూంటాయి. సాపేక్షిక వేతనాలు, యిందుకు వ్యతిరేకంగా, శ్రమశక్తిచే నూతనముగా ఉత్పత్తి చేయబడిన విలువలో 'ప్రత్యక్ష శ్రమ' యొక్క భాగం యెంతో, 'సంచిత శ్రమ' లేక 'పెట్టుబడి' యొక్క వాటా యెంతో, యీ రెండింటి యొక్కా పరస్పర సంబంధాన్ని తెలియజేస్తూంటాయి.

# కూలి-పని: పెట్టుబడి.

## ఏడో ప్రకరణం.

### వేతనములు, లాభము;- వీటియొక్క- అభివృద్ధి పతనాల్ని నిర్ణయించే సాధారణ సూత్రము.

"కూలివాడు ఉత్పత్తి చేస్తూన్న సరుకులలో వేతనాలు ఒక వంతు గావు" అని మన మిదివరలో చెప్పుకునివున్నాము. "అదివరకే తయారై సిద్ధంగా వున్న సరుకులే వేతనాలంటే. వాటితోనే పెట్టుబడిదారుడు, ఉత్పాదక శ్రమ-శక్తిని కొంటూన్నాడు." పనివాడుత్పత్తి చేసిన వస్తువులను విక్రయించి, దానిలోనుంచి పనివానికిచ్చిన మొత్తాన్ని పెట్టుబడిదారుడు పూర్తి చేస్తాడు. ఈలా చేయడంలో ఒక నియమం వుంది. ఉత్పత్తి చేయించుటకగు ఖర్చులుపోను తనకుకొంత అదనంగా మిగులవలసి వుంటుంది. అంటే, పెట్టుబడిదారుడు, తనకు కొంతలాభం వుండేటట్టుగా

చూసుకుంటాడు.

పనివాడుత్పత్తి చేసిన వస్తువుల నమ్మగావచ్చిన మొత్తము, పెట్టుబడిదారుడు మూడు భాగాలు చేస్తూన్నాడు. ఒకటి: తను పెట్టుబడి పెట్టిన ముడిపదార్థాలు, యంత్రాలు, యితర పరికరాలు,-యినన్నీ వాటి వాటి తరుగు విరుగులతో బాటు పూర్తిగా రావాలి. రెండు: కూలి- పనివాని కిచ్చిన వేతనాలను రాబట్టాలి. మూడు: తనకు కొంత లాభం, అదనంగా మిగలాలి.

ఇందులో మొదటి విభాగం, అదివరలోనే సంచితములై వున్న విలువలను మాత్రమే పూర్తి చేస్తుంది. ఇంక, వేతనములు, అదనపు లాభము,- అనే యీ రెండు విభాగాలూ కూడా నూతనంగా ఉత్పత్తి చేయబడినవే. ఇది పనివాని చేతనే ఉత్పత్తి చేయబడి, ముడిపదార్థాల విలువకు చేర్చబడుతూంది. వేతనములూ, లాభములూ,- యీ రెండింటినీ యీ అర్థంలో చూస్తేనే గ్రహించ గలము. పనివాడు ఉత్పత్తి చేసిన దానిలో యీ రెండూ రెండు వాటాలు.

ఒక్కొక్కప్పుడు యథార్థ వేతనాలు హెచ్చ వచ్చును; లేదా అట్లే స్థిరంగా వుండవచ్చును. కాని అదే సమయంలో సాపేక్షకంగా చూస్తే వేతనాలు తగ్గిపోయి వుండవచ్చును. ఉదాహరణగా ఒకటి తీసుకుందాం. జీవితావసరముల ధరలు నూటికి $66\frac{2}{3}$ వంతునను, వేతనములు నూటికి $33\frac{1}{3}$ వంతుననూ పడిపోయిన వనుకుందము. అంటే వేతనములు మూడు షిల్లింగులనుంచి రెండుషిల్లింగులకు తగ్గినాయి. పనివానికి లభిస్తూన్న రెండు షిల్లింగులకే వెనుకటికన్న యెక్కువవస్తువులు లభిస్తాయి. అంటే యథార్థ వేతనాలు హెచ్చినవని అర్థము. కాని, పెట్టుబడిదారుని లాభాలతో పోల్చిచూస్తే, వేతనాలు తగ్గినాయనే చెప్పాలి. పెట్టుబడదారునియొక్క లాభం, [కూలివాని ఒకటికి] ఒకషిల్లింగు చొప్పున హెచ్చింది. అంటే పనివాడు తాను తీసుకునే తక్కువ వస్తువులకే [యిదివరకుకన్న] మునుపటికంటె హెచ్చు విలువగల మారకపు విలువలను ఉత్పత్తి చేయవలసి వుంటుంది. ఉత్పత్తిఅయిన దానిలో కూలి పనివాని వాటాకంటె,

పెట్టుబడి దారుని వాటా పెరిగింది. సామాజిక సంపద్విభాగంలో, పెట్టుబడికీ, కూలి- పనికీ గల వాటాల మధ్య అసమానత మరింత హెచ్చింది. అదే పెట్టుబడితో ఇంకా యెక్కువ మంది కూలీలచేత పనిచేయించుకో గలుగుతారు, పెట్టుబడి దారులు. కూలీ వర్గం మీద పెట్టుబడిదారి వర్గంయొక్క ప్రభావం ఇంకా యెక్కువగా సాగుతుంది; కూలి- పనివాని హోదా సమాజంలో మరింత తక్కువ దశలో వుంటుంది; పెట్టుబడి దారునికీ, పనివానికీ మధ్యగల అవాంతర భేదం మరొక డిగ్రీ హెచ్చి పోతుంది.

అయితే వేతనములు, లాభములు,- వీటి యొక్క హెచ్చు తగ్గులలో గల సంబంధమును నిర్ణయించే సూత్రం యేదైనా వుందా?

ఇవి రెండూ ఒకదాని కొకటి విలోమసంబంధములో నిలబడి వుంటాయి. శ్రమయొక్క వాటా [వేతనములు] తగ్గుతూన్న కొలదీ పెట్టుబడి యొక్క వాటా [లాభం] హెచ్చుతుంది; అది హెచ్చుతూన్న కొలదీ రెండోది తగ్గుతుంది. వేతనములు హెచ్చు

తూన్నట్లే లాభము తగ్గుతుంది. అవి తగ్గుతూన్న పరిమాణంలోనే లాభం హెచ్చుతుంది.

కాని, ఇక్కడికి వచ్చేటప్పటికి, యింకో పూర్వపక్షం బయలుదేర వచ్చును. ఒక పెట్టుబడిదారుని లాభాలు హెచ్చడాని కితర కారణాలు చూపుతారు. ఇతర పెట్టుబడి దారులతో తన సరుకులను లాభసాటిగా మార్చుకో గలుగ వచ్చును; లేదా తనసరుకుల కెక్కువ 'డిమాండు' కలుగుటవల్ల [యిదికొత్తగా మార్కెట్లు యేర్పడుట వల్లగాని, వెనుకటి మార్కెట్లలోనే తాత్కాలికంగా డిమాండు పెరుగుట మూలంగా కాని తటస్థించవచ్చును.] కూడ లాభములు హెచ్చ వచ్చును. ఒక పెట్టుబడి దారునికి యితర పెట్టుబడి దారులకంటె మంచి అవకాశాలు యేర్పడుటవల్లనే ఆతని లాభాలు హెచ్చ వచ్చును. ఇదీ వాళ్ళ వాదనాక్రమము. అంటే శ్రమశక్తి యొక్క మారకపు విలువలతో నిమిత్తం లేకుండానే,- వేతనముల హెచ్చు తగ్గులతో నిమిత్తం లేకుండానే లాభాలు హెచ్చ వచ్చునని అర్థం. లేక యింకో కారణంకూడా

చెప్పవచ్చును. యంత్రపరికరాలలో నూతనాభివృద్ధిని తీసుకురావడం వల్లనూ, ప్రకృతి శక్తుల నధికాధికంగా స్వాధీనంలోకి తెచ్చుకోడం వల్లనూ కూడా, ఒకప్రత్యేకవ్యక్తికి లాభాలు హెచ్చుగా రావచ్చును.

ఆగండి! ఒక్కటి మాత్రం గమనార్హమైన విషయం వుంది. ఏ దెల్లా వున్నా, దీనికి పర్యవసానం మాత్రం ఒకటే! ఎటొచ్చీ మార్గంమాత్రం భేదంగా వుంది. ఈ సందర్భంలో వేతనాలు తగ్గడం మూలము ననే లాభాలు హెచ్చలేదు. కాని, లాభాలు హెచ్చడం మూలముననే వేతనాలు తగ్గినాయి. వెనుకటి పరిమాణమేగల కూలి-పనివల్ల పెట్టుబడిదారు డిదివరకటి కంటె యెక్కువ పరిమాణం గల మారకపు విలువల్ని కొంటున్నాడు. అయినను శ్రమకుయెక్కువ ప్రతిఫలాన్ని మాత్రం యివ్వడమే లేదు. అంటే ఏమిటి? పెట్టుబడిదారునికి యీ శ్రమవల్ల యెంత నికర లాభం వస్తూందో, దానికి తగిన వేతనాలు శ్రమకు యివ్వడమే లేదు.

ఇంక రెండోది: వర్తకపు సరుకుల ఖరీదులలో

కలుగు మార్పుతో సంబంధం లేకుండానే వాటి వాటి సగటు ఖరీదులు ఆ యా వస్తువులను ఉత్పత్తి చేయుటకగు ఖర్చునుబట్టియే నిర్ణయించ బడుతూన్నాయి. [సరుకు లొకదాని కొకటి మార్చుకోబడు నప్పటి సంబంధ సామ్యమునే 'ఖరీదు' అంటాం.] ఒకరి నొకరు మించుటకు ప్రయత్నించడం, లాభాల్ని యెక్కువగా గడించడం,- యివి పెట్టుబడి దార్లకు సహజమే. అయినా, కడపటికి వీటన్నిటికీ ఫలితం ఒకటే! యంత్రాలలో నూతనాభివృద్ధి కలుగుట, ప్రకృతి శక్తుల నధికంగా స్వాధీనం చేసుకుని, ఉత్పత్తి కార్యాలలో వినియోగించుట,- వీటివల్ల అదే పరిమితి గల శ్రమతో, అదే కాల పరిమితిలోనే, యెన్నోరెట్లు అధికంగా వస్తువుల నుత్పత్తి చేయవచ్చును. కాని, యేలాగునా, ఎక్కువ మారకపువిలువలను మాత్రం ఉత్పత్తి చేయనే లేరు! వడుకు యంత్రంతో ఒకడు పూర్వముకంటె రెట్టింపు దారము తీయగలుగుతూన్నాడంటే, అర్థం ఏమిటి? ఉదాహరణగా: వెనుక 50 పౌనులదారం తీసేపనివాడే, యీ యంత్రంతో 100 పౌ

నులదారం తీస్తూన్నాడనుకుందము. అయితే పూర్వం, ఆ 50 పౌనుల దారాన్ని మార్చుకోవడంవల్ల అతడికెంత పరిమాణంగల యితర వస్తువులు లభించేవో, ఆ పరిమాణంగల వస్తువులే యిప్పుడు యీ 100 పౌనుల దారమూయిస్తే లభిస్తూన్నాయి. ఎందువల్ల? ఉత్పత్తి చేయుటకగు ఖర్చు చెరిసగానికి తగ్గిపోయింది గనుక. అదే పరిమితిగల శ్రమశక్తితో రెట్టింపు నూలును తయారు చేసేముగనక.

చిట్టచివరకు ఏమిటి తేలుతూంది? ఒక దేశపు పెట్టుబడిదారీ వర్గం కాని, ప్రపంచం అంతట్లోనూ వున్న పెట్టుబడిదారులు కాని, వస్తూత్పత్తి వల్ల లభించిన నికరాదాయాన్ని తమలో తాము యే యే వంతులుగా మార్చుకో నీయండి. ఆ వంతులతో మనకు నిమిత్తం లేదు. కాని యీ మొత్తం నికరాదాయం అంతా కూడా, సంచిత శ్రమకు [పెట్టుబడికి] ప్రత్యక్షశ్రమ వల్ల (direct labour) చేయ్యబడిన సరుకుల మొత్తానికి సమంగా వుండి తీరుతుంది. అందుచేత శ్రమ, పెట్టుబడిని యే వంతు ప్రకారంగా పెంచు

తూందో, ఆ వంతులుగానే యీ మొత్తం కూడా పెరుగుతూంటుంది. అంటే, వేతనాలు- లాభాలు,- వీటిని పోల్చినపుడు యే వంతు వస్తుందో ఆ వంతు లోనే ఈ మొత్తం కూడా పెరుగుతూంది.

# కూలి-పని: పెట్టుబడి.

## ఎనిమిదో ప్రకరణం.

పెట్టుబడి, కూలి-పని:- వీటి ప్రయోజనాలు పరస్పరవిరుద్ధములు: వేతనములపై ఉత్పాదక పెట్టుబడి యొక్క ఫలితములు.

మనం యింతవరకూ పెట్టుబడి, కూలి-పని, యీ రెండింటి సంబంధములనూ గూర్చి చర్చించి, వీటి ప్రయోజనములు పరస్పర విరుద్ధములైన వని తెలుసుకొని వున్నాము.

పెట్టుబడియొక్క శీఘ్రాభివృద్ధి అంటే, లాభాలయొక్క పెరుగుదలయే. శ్రమయొక్క ఖరీదు [సాపేక్షక వేతనాలు], ఎంత త్వరగా తగ్గునో, లాభాలు అంత త్వరగా పెరుగుతాయి. సాపేక్షక వేతనాలు తగ్గవచ్చును. కాని, అదే సమయంలో నామకః లభించు వేతనాలూ [శ్రమయొక్క ధనపరూపు విలువ], వాటితో బాటు యథార్థ వేతనాలూ కూడా హెచ్చు

వచ్చును. ఇదెప్పుడు తటస్థించుతుంది? లాభాలతో బాటుగా, యథార్థ వేతనాలు సరిసమాన వాటాల లో పెరిగినప్పుడే యిట్లు జరుగుతుంది. ఉదాహరణ గా, మంచి బాగా వ్యాపారం జరిగే సందర్భంలో వేత నాలు 5 % హెచ్చినాయి; లాభాలు 30 % హెచ్చి నాయి; ఫలితంగా సాపేక్షక వేతనాలు [లాభముల తో వేతనముల పెరుగుదల పోల్చిచూస్తే] తగ్గినవే కాని హెచ్చలేదు.

అందువల్లనే పెట్టుబడి యొక్క సత్వరాభివృద్ధి తో బాటుగా పనివాని రాబడి హెచ్చుతూన్నా, పెట్టుబడి దారునికీ, పనివానికీ మధ్యగల సామాజిక విభేదం మరింత హెచ్చుతూంది. పనివాని మీద పె ట్టుబడిదారుని అధికారం పెచ్చుపెరుగుతూంది. శ్రమ యొక్క పరాధీనత మరింత బలపడుతూంది.

'పెట్టుబడి యొక్క సత్వరాభివృద్ధి వల్ల పని వానికీ వుపయోగం వుంది' అనడంలో అర్థం ఏమిటి? పనివాడెంత యెక్కువగా పెట్టుబడిని పెంచుతూం టాడో, అంతంత పెద్ద పెద్ద ముక్కలు పనివానికి పడే

స్తూంటారు. ప్రజల్లోంచి అంతంత ఎక్కువ మంది శ్రామికులుగా అయిపోతూంటారు. పెట్టుబడి మీద ఆధారపడి యున్న వాళ్ళ సంఖ్య అంతకంతకు హెచ్చుతూంటుంది.

పెట్టుబడియొక్క శీఘ్రాభివృద్ధిలోనే కార్మిక వర్గానికి అనుకూల పరిస్థితులు యిమిడి వుంటాయి. ఇందువల్ల పనివాళ్ళ యొక్క భౌతిక జీవిత విధానం యెంతో అభివృద్ధి జెందవచ్చునే గాని, ఈ రెండు వర్గాల మధ్యనూ గల ప్రయోజనవైరుధ్యం మాత్రం తొలగదు. వేతనాలు: లాభం,- ఈ రెండూ యథాప్రీతిగానే విలోమ నిష్పత్తి (inverse proportion) లోనే వుండిపోతాయి.

పెట్టుబడియొక్క అభివృద్ధి దశలో వేతనాలు పెరగవచ్చును. కాని, లాభాలు యింకా హెచ్చుగా పెరుగుతాయి. పనివాని భౌతిక పరిస్థితులు [సుఖవిలాస సామగ్రులు] కొంత అభివృద్ధినే సూచిస్తాయి. కాని సమాజంలో, అతని స్థానం మరింత క్రింది మెట్టుకు దిగిపోతుంది. పెట్టుబడి దాఁకుతూ, పనివానికీ

మధ్యవున్న సామాజికవిభేదం మరింత అఖాతం [మొక్కవ] అయిపోతూంది.

"కూలి. పనికి అత్యంతానుకూల మగు పరిస్థితులు ఉత్పాదక పెట్టుబడి యొక్క అతిశీఘ్రాభివృద్ధిలోనే వున్నాయి." దీనికర్థం ఏమిటి? కార్మికవర్గం, తనకు విరోధియైన వాని శక్తిని పెంపొందించుతూ, అభివృద్ధిలోకి తీసుకువస్తూన్నకొద్దీ, తనమీంద ఆధికారం చెలాయిస్తూన్న మరొక వర్గంయొక్క సంపద నధికం చేస్తూన్న కొద్దీ, మరికొంత అనుకూలమైన, ఆకర్షకమైన షరతులకు లోబడి పనిచేయ గలుగుతుంది. అదైనా తిరిగి తన శత్రువగు బూర్జువా వర్గంయొక్క బలాన్ని అభివృద్ధికి తెచ్చు పనిలోనే! పెట్టుబడి యొక్క శక్తి హెచ్చుతూన్న కొలదీ, పనివానిని బంధించి వుంచుతూన్న సంకెలలు బంగారువిగా మారుతాయి. బూర్జువావర్గం తనతోబాటు కార్మిక వర్గమును కూడా బంగారు సంకెళ్ళతో బంధించి తీసుకు పోతూనే వుంటుంది. [పూర్వపు స్థితితో పోల్చినచో పనివాని సుఖ విలాసాదులు హెచ్చినా కానీ ఆతని పరాధీనత,

బానిసత్వమూ మాత్రం పోవు.]

బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు చెపుతూన్నట్లు, ఉత్పాదకపెట్టుబడియొక్క అభివృద్ధిదశలో వేతనాలు విధిగా హెచ్చింప బడుతూన్నాయా? మనం వాళ్లు చెప్పేమాటలన్నీ నమ్మడానికి లేదు. పెట్టుబడి యెంత బలాఢ్యమైనదిగా అవుతే, కూలి పని కంత యెక్కువగా తిండి పారేస్తూంటుందని బూర్జువా శాస్త్రజ్ఞులు చెప్పేది కూడా మనం నమ్మడానికి వీలుగానిదే! వెనకటి జమీందారీ ప్రభువులకంటె బూర్జువాలకు తెలివితేట లెక్కువ; వాళ్ళ లెక్కలీ్ని, జమాఖర్చులీ్ని, ఎంతో జాగ్రత్తగా చూసుకుంటూంటారు, బూర్జువాలు. జమీందారీ ప్రభువులు, బడాయికోసం, వాళ్ళ అనుచర వర్గాన్నంతనూ డాబుగా అలంకరించుకునే వాళ్ళు. బూర్జువాలు అంత తెలివితక్కువ వాళ్ళు గారు. తామొక వర్గంగా నిలబడి వుండాలంటే, తమ లాభ నష్టాలు జాగ్రత్తగా చూసుకుంటూనే వుండాలని వాళ్ళకు తెలుసును. అందుచేతనే మనంకూడా యీ విషయాన్ని బహు జాగ్రత్తగా పరిశీలించాలి.

ఉత్పాదక పెట్టుబడి అభివృద్ధి జెందుతూ, వేతనములలో యేలాంటి మార్పుల్ని కలిగిస్తూంటుంది?

బూర్జువా సమాజంలో ఉత్పాదక పెట్టుబడి పెరుగుతూందీ, అంటే, వివిధ ముఖాలుగా మానవ శ్రమ సంచితమవుతూందనే అర్థం. వ్యక్తిగతంగావున్న పెట్టుబడులు సంఖ్యలోనూ, పరిమాణంలోనూ కూడా పెరుగుతూంటాయి. ఈ పెరుగుదల, ఆ యా పెట్టుబడిదారుల మధ్యను పోటీని పెంచుతుంది. వ్యక్తుల దగ్గర ప్రోగుపడిన పెట్టుబడులు అత్యధికపరిమాణం గలవగుటతో, అసంఖ్యాకులగు కూలీలను బ్రహ్మాండమైన యుద్ధ పరికరాలనిచ్చి [యంత్ర సాధనముల తో] పారిశ్రామిక యుద్ధ రంగంలోనికి లాక్కొని వచ్చేయి.

కేవలం, తనవస్తువులను మరింత చౌకగా విక్రయించ గలగడంవల్లనే, ఒక పెట్టుబడిదారు డింకొకనిని యుద్ధరంగంలో ఓడించి, ఆతని పెట్టుబడిని కూడా స్వాధీనం చేసుకోగలుగుతాడు. తనకే వినాశం కొని తెచ్చుకోకుండా చౌకగా తన సరుకులను విక్రయించు

కోవాలంటే, యితరులకంటె చౌకగా ఉత్పత్తి చేయగలగాలి గదా! అంటే, శ్రమయొక్క ఉత్పాదక శక్తిని సాధ్యమైనంత వరకూ హెచ్చించాలన్న మాట.

కాని, యిదెల్లాగ సాధ్యమవుతుంది? శ్రమవిభాగాన్ని అధికసాంద్రతరంగా చెయ్యడం వల్లనూ, ప్రతీ ఉత్పత్తి శాఖలోనూ యంత్రాల్ని ప్రవేశపెట్టడంవల్లనూ, ఉత్పత్తి సాధనాలలో నూతనాభివృద్ధి కొనితెచ్చుట వల్లనూ, యిది సాధ్యం అవుతుంది. కూలీలను హెచ్చించి, పనులనువిభజించి వాళ్ళకు పంచి యిచ్చి, ప్రతిశాఖలోనూ యంత్రాల్ని పూర్తిగా ప్రవేశపెట్టినట్లైతే, శ్రమయొక్క ఉత్పాదక శక్తి హెచ్చుతుంది. అందువల్లనే ఉత్పత్తికగు ఖర్చులు తగ్గుతాయి. ఈ కారణంచేతనే, పెట్టుబడిదారు లందరూ తమలోతాము పోటీలుపడి, శ్రమ విభాగాన్ని సాంద్రతరంగా చేయడం, ప్రతీశాఖలోనూ నూతన యంత్రాల్ని నెలకొల్పడం, వీలైనంతవరకూ మానవ శ్రమనుంచి పనితీసుకోడం,- మొదలైన పనులు చేస్తూన్నారు.

అయితే, ఒక పెట్టుబడిదారుడు యితరులను మించి యీ పనులన్నిటినీ చేసేడనుకొందము. అంటే ఒకే పరిశ్రమను వివిధ శాఖలుగా విభజించడం, నూతన యంత్రాల్ని కనిపెట్టి, ప్రవేశపెట్టడం, బహుళంగా [యెక్కువగా] ప్రకృతి సంపదలను లాభప్రదంగా ఉపయోగించుకో గలగడం,- యివన్నీ అతను చేయగలిగేడు. ఆతను అదే పరిమితిగల శ్రమవల్ల [ప్రత్యక్ష శ్రమ గానీ, సంచితశ్రమగానీ] యితర పెట్టుబడిదారులందరికంటె అధికంగా సరుకులనుత్పత్తిచేయ గలిగితే, ఆతను ఏమి చేస్తాడు? ఉదాహరణగా: తన పోటీదారులు అరగజం గుడ్డను తయారుచేయ గలిగిన శ్రమకాలం లోనే తాను గజం గుడ్డను తయారుచేయ గలడు. అప్పుడీ పెట్టుబడి దారుడు ఏమి చేస్తాడు?

వెనుకటి మార్కెటు ధరకే ఆతడు తన గుడ్డనమ్మి, నిలబడియుండ గలడు. కాని, ఆలాగు చేస్తే, తనపోటీదార్లను మార్కెటులోంచి తరిమి, తనవ్యాపారాన్ని వృద్ధిచేసుకోగలడా? లేడు! ఆతని ఉత్పత్తి

శక్తితోబాటుగా ఆతని సరుకులకు డిమాండుకూడా హెచ్చవలసి వుంటుంది. ఆతడు ఎంతో ధనవ్యయం చేసి, శక్తివంతమైన యంత్రాది సాధనాల్ని స్థాపించగలిగేడు. అవి ఉత్పత్తి ఖర్చుల్ని తగ్గించినాయి. అందుకే తనవస్తువుల నాతడు చౌకగా విక్రయించగలడు. ఆ ఉత్పత్తి సాధనాలు, అతనినింకా యెక్కువసరుకుల నమ్ముకోమనీ, మార్కెటును సంపాదించుకోమనీ, ప్రోత్సహించుతాయి. అందువలన, మన పెట్టుబడిదారుడు తనగుడ్డను యితరులకంటె చౌకగా విక్రయిస్తాడు.

ఇతరులకు అరగజం గుడ్డ నుత్పత్తి చేయడానికెంత ఖర్చయిందో, యితనికి గజంగుడ్డకూ అంతే అయింది. కాని, యీతడు తన గజంగుడ్డనూ, యితరులు అరగజం అమ్మినఖరీదుకే అమ్మడు. అట్లుచేస్తే యితనికి ప్రత్యేకలాభాలు యేలావస్తాయి? ఈ మారకంలో కేవలమూ ఉత్పత్తికగు ఖర్చులు మాత్రం వచ్చి పూడుకుంటాయి. తనకదివరకున్న పెట్టుబడి మీదనే యితరులకంటె యెక్కువలాభాలు తీస్తే వచ్చేరాబడి

కంటె పెట్టుబడి నెక్కువచేసి, ఉత్పత్తి నధికం చేస్తేనే మా పెట్టుబడిదారు డెక్కువ లాభాలు తీయగలుగుతాడు. అలాగ చేస్తేనే గాని అతని తృష్ణ తీరదు. పోటీదారులకంటె తక్కువ లాభాన్నే కట్టుకుని [వాళ్ళు నూటికి 10 లాభం కట్టుకుంటే తాను 5 మాత్రమే కట్టుకోవాలి.] సరుకుల ధరలు వాళ్ళకంటె తగ్గిస్తే, యితరుల మార్కెటు పడిపోతుంది. ఇతని సరుకులకు డిమాండు హెచ్చుతుంది. వాళ్ళ నందరినీ మార్కెటులోనుంచి తరిమివేయ గలుగుతాడు.

ఇక్కడ, మనం ఒకవిషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఎప్పుడూ, ఆ యా వస్తువుల తాత్కాలిక ధరలు, వాటి ఉత్పత్తి ఖర్చులకంటె కొంచెం యెక్కువగానో, కొంచెం తక్కువగానో వుంటూంటాయి. ఆ యా వస్తువుల అమ్మకాన్నిబట్టి, ఆ యా పరిశ్రమల యొక్క అనుకూల, అననుకూల వాతావరణములపై యివి ఆధారపడి వుంటాయి. ఒకగజం గుడ్డయొక్క తాత్కాలిక మార్కెటుధర యెప్పుడూ దాని ఉత్పత్తి ఖర్చులకంటె కొంచెం హెచ్చుగానో, తగ్గుగానో

వుంటుందని మనమిదివరలోనే తెలుసుకొని వున్నాము. నూతన యంత్రాల నుపయోగించిన పెట్టుబడిదారుడు, తన కగు ఉత్పత్తి ఖర్చులకంటె ఎంత 'శాతం' (%) హెచ్చువేసి అమ్మేవాడో? అనే దాన్ని, యీ ధరలను బట్టియే నిర్ణయించు కుంటాడు.

కాని, మన పెట్టుబడి దారునికీ సదుపాయం యెంతోకాలం వుండదు. ఇతర పెట్టుబడి దారులుకూడా ఆ మాదిరి ఆధునికయంత్రాలనే ఉపయోగించి, శ్రమ విభాగాన్ని అదే మాదిరిగా సాంద్రతరం జేసి, యింకా హెచ్చు పెట్టుబడితో ఉత్పత్తిని కొనసాగిస్తారు. ఈ పద్ధతులనే అందరు పెట్టుబడి దారులూ ఉపయోగించడంతో, గుడ్డ ఖరీదు తగ్గుతూవచ్చి, చివరకు దాని ఉత్పత్తి ఖర్చులకంటెనూ, తక్కువలోకి దిగి పోతుంది.

ఇందువల్ల, పెట్టుబడి దారులు తిరిగి వెనుకటి పరిస్థితుల్లోనికే వస్తారు. ఏ పరిస్థితులు, నూతనయంత్ర నిర్మాణానికి ప్రోత్సాహాన్ని యిచ్చినాయో, ఆ పరిస్థితులే తిరిగి యేర్పడుతాయి. వెనకటికంటె తక్కువ

ధరలకే యీ నూతనయంత్రాల వల్ల గుడ్డను అమ్మగలిగేరు; కాని, తిరిగీ యింకా తక్కువ ధరలకు గుడ్డ నుత్పత్తి చేసి, విక్రయించవలసిన భారం పెట్టుబడిదారునిమీద విరుచుకుపడింది! ఇందుకే యింకా ఆధునికయంత్రనిర్మాణం చేసి, మార్కెట్టులో పోటీచేయ నారంభిస్తారు, పెట్టుబడిదారులు. శ్రమవిభాగం, యింకా సాంద్రతరం చేయబడుతుంది. ఉత్పత్తి సాధనాల నుంచి పనిని యింకా జోరుగా తీసుకొంటారు. పర్యవసానంగా ఉత్పత్తి ఒక అడుగు ముందుకు వేస్తుంది; కాని, మళ్ళీ కొద్దికాలంలోనే, యెప్పటి సమస్యయే మళ్ళీ యెదుర్కొంటుంది.

# కూలి-పని : పెట్టుబడి.

## తొమ్మిదో ప్రకరణం.

### పెట్టుబడి దారీవర్గం, మధ్యతరగతి, కూలీవర్గం,-
### వీటిపై పెట్టుబడిదారీ పోటీ యొక్క ఫలితాలు.

ఈ విధంగా ఉత్పత్తి విధానమూ, సాధనాలూ కూడ క్రమంగా పరిణామం పొందుతూ, విశాలము నర్ప బడుతూ, అభివృద్ధి చేయబడుతూనే వుంటాయి. శ్రమవిభాగం ఒకసారి ప్రవేశపెడితే, అదే మరింత యెక్కువగా శ్రమవిభాగం చేయడానికీ; ఒకయంత్రాన్ని ప్రవేశపెడితే, మరికొన్ని యంత్రాల్ని స్థాపించడానికీ; బహుళంగా వస్తూత్పత్తి చేయడమే యింకా యెక్కువగా వస్తూత్పత్తిని కొనసాగించడానికీ;-తగిన పరిస్థితుల్ని తెచ్చి తీరుతాయని కూడా మనం ఋజువు చేసేము. పెట్టుబడి, అదివరకే శ్రమయొక్క ఉత్పత్తి

శక్తిని పూర్తిగా ఉపయోగించు కుంటూంది. అందువల్లనే ఆ శక్తిని యింకా పూర్తిగా పీల్చి పిప్పిచేయుడానికి అవకాశం గలిగింది. ఈ లక్షణమే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని దాని వెనుకటి మార్గంలో నుంచి గెంటివేచి, నూతన మార్గాల్లోకి యీడ్చుతూ వుంటుంది. మానవుని ఉత్పత్తి శక్తి కొంతమాత్రమూ విశ్రాంతి నీయకుండా, దాని చెవుల్లో 'నడు, నడు' మని అరుస్తూ, తొందర పెట్టడానికి గల మూలసూత్రం దీనిలోనే వుంది. వ్యాపారంలో కొన్ని సంవత్సరాల కొకసారి మార్పులు జరుగుతూనే వుంటాయి. ఆ సమయాల్లో ఆ యా సరుకుల ఖరీదులను వాటి వాటి ఉత్పత్తి ఖర్చులతో సమంగా *వుండేటట్లుగా చేసే నియమమే, ఆ మూల సూత్రము!

---

*దీన్ని కొంచెం విస్పష్టం చేయవలసి వుంటుంది. మానవ జాతి పరిణామం పొందడంలో గల మూలసిద్ధాంతం యిందులో యిమిడివుంది. 'అవసరం' తీర్చుకోడానికే తమ అమూల్య కాలాన్నంతనూ భౌతిక వస్తూత్పత్తిలో వినియోగపరుస్తూన్న మానవజాతి, కొద్ది కాలంలోనే యీ 'అభివృద్ధి జెందిన' యంత్ర సాధనాలతో తన అవసరాలు తీర్చడానికి కావలసిన వస్తువుల్ని తయారుచే

సుకుని, మిగిలిన కాలాన్నంతనూ విజ్ఞానోపార్జనకై వినియోగించుకొనే 'స్వేచ్ఛ' ను సంపాదిస్తుంది. ఇందులోనే యంత్ర సాధనాల యొక్క అవసరం మనం గుర్తించగలం. (దీనికి వ్యతిరేకంగా ప్రతి దేశంలోనూ చేతిపరిశ్రమలు, గ్రామపరిశ్రమలు కావాలని వాదించేవాళ్లు వుంటూనే వచ్చేరు. ప్రస్తుతం గాంధీజీ యొక్క అంతరాత్మ చెపుతూన్న కొత్త సిద్ధాంతమాత్రం కాదిది.) ఒక నేతవాడు చేతిపరిశ్రమల యుగంలో ఒకగజం గుడ్డను తయారుచేయడానికి ఒకరోజుపని చేసేడనుకుందము. దానిఖరీదు ఆరోజులలో, ఆపనివాడు జీవించియుండ గలగడానికీ, తన పనిని నిర్వహించు కోగలగడానికీ అవసరమైన వస్తువుల ఖరీదుతో సమానము. క్రమంగా యీ ఉత్పత్తి సాధనాలు అభివృద్ధిజెందుతూ, ఉత్పత్తి సుకరంగా జొచ్చింది. ఒకపనివాడు, ఒకరోజులో 10 గజముల గుడ్డ నుత్పత్తి చేయుగలుగు తూన్నాడు. అందువల్లనే దాని ఖరీదుకూడ తగ్గింది. యంత్రాలు యింకా అభివృద్ధిచెంది, ఆ పనివాడే రోజులో 50 గజాల గుడ్డ నుత్పత్తిచేయగలుగుతాడు. అప్పుడు గుడ్డ ఖరీదుయింకా తగ్గిపోతుంది. ఉత్పత్తి సాధనములలో యీ అభివృద్ధిని నిరోధించడం ఎవరికీ సాధ్యముకానిపని. ఒకసారి యీ అభివృద్ధి కలిగిందీ అంటే, అదే 'పోటీ' వల్ల యింకా నూతనాభివృద్ధులకు దారితీస్తుంది. ఉత్పత్తిని శాఖోపశాఖలుగా విభజించి, ఉత్పత్తి యొక్క వేగాన్ని యెన్నోరెట్లు హెచ్చించుతారు, పెట్టుబడి దారులు. 10 క

లైన ఉత్పత్తి సాధనాలను రంగంలోకి తీసుకువచ్చినా, కొద్దికాలంలోనే పోటీవల్ల యితర పెట్టుబడిదారులు అందరూ కూడా ఆ సాధనాలనే అవలంబిస్తారు. ఈ యాంత్ర సాధనాలని అందరూ అవలంబించిన మరుక్షణంనుంచీ వస్తూత్పత్తి ఇంకా ఎన్నెన్నోరెట్లు అధికం అవుతుంది. ఈ అధికోత్పత్తికి ఫలితం ఏమిటి? వెనుకటి కంటె పది, యిరవై, వంద రెట్లుగా వుత్పత్తి అయిన వస్తువులను వెనుకటి ధరలకే విక్రయించాలి. కాని ఆ సరుకులకుతగిన మార్కెట్టుకూడా చూడాలి. వెనుకటి కంటె వెయ్యి రెట్ల సరుకు విడుదల కాగల మార్కెటు కావాలి. ఎందుకంటే. వ్యాపారం లాభకరంగా వుండాలంటే అత్యధిక పరిమాణంగల సరుకు

దుళ్ళవద్ద పనిచేయవలసిన వాడికి 50 కదుళ్ళు నప్పగిస్తారు. నిముషానికి 1000 గజాలు దారంతీసే యంత్రాన్నే 2000 గజాలుతీసేట్లు చేస్తారు. ఇందువల్ల ఆ పనివాని యొక్క శక్తిని అధికాధికంగా పిండివేస్తూంటారన్నమాట. ప్రతీనూతన యంత్రంతోటీ, ఉత్పత్తివిధానం నూతనమార్గాలనుపట్టి పోతూంటుంది. కాని మొత్తం మీద చూస్తే, ప్రతివస్తువు ఖరీదూ దాని ఉత్పత్తికగు ఖర్చుతో సరి పోయి తీరుతూంటుంది. అనువాదకుడు.

లమ్మవలసివుంటుంది. [సరుకులధరలు తక్కువగనక] ఎక్కువ లాభాన్ని సంపాదించడానికే గాక, ఉత్పత్తిఖర్చును తిరిగి కూడబెట్టడానికి కూడా [ఉత్పత్తిపరికరాలంతకంత కధికవ్యయమూలకము లవుతూంటా యని యిదివరకే చూసేము.] సరుకు విడుదల నెక్కువచేయవలసి వుంటుంది. సరుకును విరివిగా విడుదలచేయ గలగడం అనేది ఆతనికీ, అతనిపోటీ దారులకూ కూడా జీవిత సమస్య అవుతూంది. అందువల్ల తిరిగి వెనుకటి పోరాటం మరింత తీవ్రంగా చెల రేగుతుంది. ఉత్పత్తి సాధనాలు ఎంతశక్తివంతములైనవైతే యీపోరాటం అంతతీవ్రంగా వుంటుంది. ఈ పోరాటానికి ఫలితంగా, శ్రమవిభాగము- యంత్రసాధనాలు, మరింతవిరళంగా బయలుదేరుతూంటాయి.

ఉపయోగించబడుతూన్న ఉత్పత్తి సాధనాలు యెంతశక్తిగలవైనాసరే, పెట్టుబడిదారులలోని పోటీవల్ల సరుకులధరలు, వాటి ఉత్పత్తిఖర్చులతో సమానమే అవుతూంటాయి. ఉత్పత్తిశక్తి హెచ్చడం వలన కలుగవలసిన సత్ఫలితములనూ, అమితంగారావలసిన

లాభాల్నికూడా యిదే [సరుకులధరలు వాటి ఉత్పత్తి ఖర్చులతో సమానం కావడం ] లాగేస్తూంటుంది. అదే శ్రమతో సరుకులను అధికంగా ఉత్పత్తి చేయడం అంటేనే ఉత్పత్తిఖర్చులు తగ్గడం అని అర్థం. ఇదే, అనివార్యమైన బలంతో ఉత్పత్తి నింకనూ చౌక చేయాలనీ, సరుకుల నంతకంతకు తక్కువ ధరలకు విక్రయించాలనీ శాసిస్తూంటుంది. ఈ రీతిగా పెట్టుబడిదారునికి యేవిధమైన లాభములూ రాకపోవడమే గాక, అదే శ్రమ - కాలములో మరింత యెక్కువగా సరుకుల నుత్పత్తి చేయవలసిన భారం, మీాద విరుచుకుపడుతుంది. పెట్టుబడిని లాభప్రదంగా వినియోగం చేయడంలో గల ఆటంకాలు హెచ్చిపోతూ వుంటాయి. 'పోటీ' అనేది పెట్టుబడిదారును నిరంతరం వెంటాడుతూ, 'ఉత్పత్తి ఖర్చులు' అనే సూత్రంతో బాధించి వుంచుతూంటుంది. తన పోటీదారులమీాద ఆతను ప్రయోగించే ప్రతీ ఆయుధమూ, తనకుకూడా తగులుతూనేవుంటుంది. ఈ రీతిగా పెట్టుబడిదారులు నిరంతరమూ నూతన యంత్రాలను స్థాపించి, శ్రమ

విభాగాన్ని పెంపించి, తమ ఉనికిని నిలుపుకోడానికి ప్రయత్నిస్తారు. ప్రతీనూతన యంత్రమూ అమిత వ్యయ మూలకమే అయినా, సరుకుల్ని చౌకగా ఉత్పత్తి చేయగల అవకాశం గలిగిస్తూంది. ఈ విధంగా నిరంతరం ముందుకు పోతూ వుండవలసిందే గాని యే నూతన యంత్రమూ పాతబడేవరకూ కనిపెట్టుకుని కూర్చోడానికి అవకాశం వుండదు.

మొత్తం ప్రపంచం అంతట్లోనూ మార్కెట్టులో యీ తీవ్ర సంచలనం యే రీతిగా పనిచేస్తూందో, మనంచూసేము. పెట్టుబడి క్రమంగా పెరుగుటను, పోగుపడుటను, కేంద్రీకృత మగుటను కూడ గమనించి వున్నాము. పెట్టుబడియొక్క యీ క్రమాభివృద్ధే, శ్రమలో అవాంతర విభాగాన్ని పురాతన యంత్రాభివృద్ధినీ, నూతన యంత్రనిర్మాణాన్ని కూడా నిరంతరాయంగా, క్రమాధికంగా, జ్వరతీవ్రతతో ముందుకు తీసుకు పోతూంటుంది.

కాని, ఉత్పాదక పెట్టుబడి యొక్క అభివృద్ధితో అవినాభావ సంబంధముగల యీ పరిస్థితులకు

వేతనములమీద యేలాంటి ప్రభావం వుంది? ఈ రెం డింటికీ గల సంబంధం యెట్టిది?

శ్రమవిభాగం అభివృద్ధి చెందినకొలదీ ఒకపని వాడు అయిదుగురి పనిని చేయగలుగుతాడు; క్రమం గా అతడే పది, యిరవై మంది చేయగల పనిని చేయ గలుగుతాడు. అందువల్ల పనివాళ్ళలో తీవ్రంగా పోటీ యేర్పడుతుంది. ఒకడికంటె మరొకడు తనను చౌకగా విక్రయించుకోవడంలో పోటీ పడడమే గాక, ఒకడే అయిదు, పది, యిరవైమందిచేయు పని చేయ డం మొదలు పెడతారు. శ్రమవిభాగం సాంద్రతరం కావడంవల్లనే పనివాళ్ళలోని పోటీ తీవ్రరూపం దా లుస్తూంది. దీనిని పెట్టుబడే ప్రవేశపెట్టి, అభివృద్ధిలో నికి తెచ్చింది.

అంతేకాదు. శ్రమ యెంత యెక్కువగా విభ జింపబడుతుందో, పని అంత సులభం అవుతూంది. పనివాని ప్రత్యేక నిపుణతకు విలువ వుండదు. పని వాళ్లు, శారీరక మానసిక చతురత లేనివాళ్లై, కేవ లం కీలుబొమ్మలుగా తయారవుతారు. పనివాళ్ళలో

ఒకడు చేయగలపనిని, అందరూ చేయగలుగుతారు. పోటీదారు లన్ని వైపులనుంచీ ఆతడిని ఆక్రమిస్తారు. ఈ సందర్భంలో మనం యింకో విషయాన్ని కూడా జ్ఞాపకం వుంచుకోవాలి. ఒక నిర్దిష్టమైనపని ఎంత సులభమైన దైతే దానినంత సులువుగా నేర్చుకోవచ్చును; దాని నుత్పత్తి చేసేఖర్చు అంతగా తగ్గుతుంది. ఇతర సరుకుల ఖరీదులకువలెనే, శ్రమయొక్క ఖరీదు కూడా దాని ఉత్పత్తిఖర్చునిబట్టి నిర్ణయించ బడుతుందిగనుక యీ పనులు చేసేవాళ్ళ వేతనాలు కూడా అంతగా తగ్గిపోతాయి. అందుచేతనే ఒకపని యెంత అసంతృప్తికరమూ, అసహ్యకరమూ అయితే దానికై పోటీ అంత యెక్కువగానూ, వేతనాలు అంత తక్కువగానూ వుంటాయి.

తగ్గిపోయిన వేతనాలను సరిపెట్టుకోవాలని పనివాడు ప్రయత్నిస్తాడు. ఎక్కువగంటలు పనిచేసి, వెనుకటి మొత్తానికి సమంగా వేతనాలు సంపాదించుకోవాలని చూస్తాడు. రోజుకూలి అయితే యెక్కువ గంటలు పనిచేస్తాడు; గుత్తపని అయితే ఆ గంట

ల్లోనే అధికంగా పనిచేస్తాడు. కమువుమాటచేత ప్రేరేపించబడి, పనివాడే యీ రీతిగా శ్రమవిభాగం యొక్క వినాశకర ఫలితాల్ని వృద్ధిచేసుకుంటాడు. కాని, ఫలితంమాత్రం యథాప్రకారమే! అతడెంత యెక్కువగా పనిచేస్తే, అతని వేతనాలంతగా తగ్గుతాయి. అతడెంత యెక్కువగా పనిచేస్తూంటే, అంతయెక్కువగా తోటి పనివాళ్ళతో పోటీ చేస్తూన్నా డన్నమాట. తోటి పనివాళ్ళందరూ కూడా తన వలెనే దౌర్భాగ్యపు వేతనాలకు ఒడబడేటట్లు చేస్తూన్నా డన్నమాట: వాళ్ళందర్నీ తనమీద పోటీకి పురిగొల్పుతూన్నా డన్నమాట. కార్మిక వర్గంలో తానూ ఒకడే గాబట్టి, అతను తన మీద తానే పోటీ చేసుకున్న వాడవుతూన్నాడు.

యంత్రాలు కూడా కూలీవర్గానికి యీలాంటి ఫలితాల్నే అత్యధిక పరిమాణంలో కలుగ చేస్తాయి. కౌశల్యంగల కార్మికుల స్థానే సాధారణ కూలీల్ని, మగకూలీల స్థానంలో స్త్రీలనూ, పెద్దకూలీల స్థానంలో చిన్నపిల్లల్నీ పనిచేయుడాని కివి నియోజస్తా

యి! ప్రతి నూతనయంత్ర నిర్మాణమూ వేలకొలది పనివాళ్ళను నిరుద్యోగులుగా చేస్తుంది. యంత్రాలు బాగా అభివృద్ధి జెందే దశలో, యెక్కువగా ఉత్పత్తి చేసేటప్పుడు కూడా కొద్దీ గొప్ప పనివాళ్ళను త్రోసి పారేస్తూనే వుంటాయి.

పెట్టుబడిదారులు తమలో తాము, జరిపే పారిశ్రామిక పోరాటాన్ని మనం సంక్షేపంగా తెలుసుకున్నాము. ఈ పోరాటంలో ఒక ప్రత్యేకత వుంది. ఎక్కువమంది కూలీలను చేర్చుకొన్న వాళ్ళు ఓడిపోవడమూ, ఎక్కువమందిని తొలగించినవాళ్ళు జయించడమూ,— యిదే యీ పోరాటానికి ఫలితము! ఎవరెక్కువమంది పారిశ్రామిక సైనికులను తొలగించగలరూ!* అనే విషయంలో సేనాధిపతులు [పెట్టుబడి

*ఎక్కువమంది కూలీలను తొలగించడం, అంటే యంత్ర సాధనాలలో నూతనాభివృద్ధిని గొనితెచ్చి, ఉత్పత్తి ఖర్చులని తగ్గించడం, అని అర్థము. ఉత్పత్తి ఖర్చులు తగ్గించుటకో గలిగిన పెట్టుబడిదారుడు, చౌకగా తన సరుకులను విక్రయించి, తోటి పెట్టుబడిదారులను మార్కెటులోనుంచి తరుమగలుగుతాడు. అనువాద:

దారులు] తమలో తాము పోటీలు పడుతూంటారు.

అర్థశాస్త్రజ్ఞులు యిక్కడ మరోసంగతి చెపుతారు: యంత్రాలవల్ల తొలగించబడిన కార్మికులకు మరొక రీత్యానైనా పనులు దొరుకుతూనే వుంటాయని. నూతనంగా స్థాపించబడిన పరిశ్రమలలోనూ, యంత్రాగారాల్లోనూ అదివరకు పనుల్లోవుండి, తొలగించబడిన కార్మికులే చేర్చుకోబడు తూన్నారని యీ బుద్ధిమంతులు ఋజువు చేయలేరు! వాళ్లు చెప్పేది అబద్ధమని యధార్థ సంఘటనలు చాటుతూనే వున్నాయి. కొత్తగా బయలుదేరు కార్మికులకు పనులు దొరికే యేర్పాట్లుంటాయనే వాళ్లు చెప్పే దానికి సరియైన అర్థము. ఉదాహరణగా: అంతక్రితమే యెత్తివేయబడిన పరిశ్రమలో చేరియుండవలసిన కార్మిక యువకులకు మరొక పరిశ్రమలోనైనా పనులు దొరుకుతాయి. అశక్తులైపోయిన కార్మికులకు యిది కొంత సంతృప్తి కరమైన విషయమే, మరి! పోయిన వాళ్లు పోగా, దోచుకోడానికీ, పీడించి చాకిరీ చేయించుకోడానికీ, కావలసి నంతమంది పడుచువాళ్లు దొరుకు

తారు గదా, మన పెట్టుబడిదారునికి! ఈ అర్థశాస్త్ర జ్ఞులు పెట్టుబడిదారులనే ఊరడిస్తారు, తమ సిద్ధాంతాలతో! కార్మికుల కేవిధమైనా సుఖాన్నియ జాలవు. యంత్రాలవల్ల మొత్తం కార్మిక వర్గమంతా నాశనం చేయబడిపోతే, పెట్టుబడిదారు లింకెవరిని పీక్కు తింటారు? 'కార్మికులు' అనేవాళ్లే లేకుండాపోతే 'పెట్టుబడిదారులు' మాత్రం ఏలాగు వుంటారు?

పోనీ, వాదంకోసం ఒప్పుకుందము. యంత్రాలు రావడంవల్ల నిరుద్యోగులుగా వుండిపోయిన వాళ్ళూ, ఆయా పరిశ్రమలలో నూతనంగా చేరదలచి అదనుకై వేచియున్న పడుచువాళ్ళూ కూడా యేదో ఒక నూతన పరిశ్రమలో ప్రవేశించ గలిగేరనే యందము. అయినా వీళ్ళకి, యథాపూర్వంగా రావలసినంత కూలి వస్తూందా? రాదు! 'వస్తుంది' అనే గనక ఋజువుచేస్తే, అర్థశాస్త్రం అంతా బురదలో పూరదొక్క వలసిందే! ఆధునికపరిశ్రమలు వచ్చి, ప్రతి పనినీ సులభ తరంగానూ, నేర్పు అవసరం లేకుండానే చేయదగినవి గానూ చేస్తాయని, మనం చూసేవు

న్నాము. అందుచేత ఒక పరిశ్రమలో పనిలేకుండా [యంత్రాలు రావడంవల్ల] తరుమబడిన కార్మికులం దరూ మరొక పరిశ్రమలో యింకా తక్కువ జీతాల కే కాకపోతే యేలా చేర్చుకోబడుతారు?

కాని, యీ సూత్రానికి ఒక్క మినహాయింపును మాత్రం చెప్పేరు. ఇది, యంత్రనిర్మాణ పరిశ్రమలోని కార్మికులకు మాత్రం వర్తించదు. పరిశ్రమలలో యంత్రాలు వుపయోగించాలి. గనుక యంత్రాలకు డిమాండు హెచ్చుతుంది. యంత్ర నిర్మాణ పరిశ్రమ వృద్ధిజెందుతుంది. ఈ పరిశ్రమలో పని చేసే కూలీల సంఖ్య పెరుగుతుంది. ఈ పరిశ్రమలో పనిచేసేవాళ్ళు తప్పని సరిగా నిపుణులూ, విద్యాధికులూ కూడా అయివుంటారు.

1840 వ సంవత్సరానికిపూర్వం, యీ సిద్ధాంతం కొంతవరకు యథార్థమే. కాని, అటుతర్వాత యిది పూర్తిగా యథార్థదూరమై పోయింది. యంత్రనిర్మాణ పరిశ్రమలోకూడా అనేకరకాల యంత్రాల్ని ఉపయోగిస్తూన్నారు. యంత్ర నిర్మాణశాలలలోని

కార్మికులు కూడా, యెంతో చతురతతో పనిచేసే బ్రహ్మాండమైన యంత్రాల ముందర నట్టి మొద్దుల్లాగ నిలుచునే పరిస్థితులు వచ్చేసినాయి.

యంత్రములు ప్రవేశపెట్టబడి నందున తొలగించబడిన ఒక కూలి- పనివాని స్థానే, పెట్టుబడిదారుడు ఒక స్త్రీని, ముగ్గురు పిల్లలను నియమించినాడనుకుందము. ఆ పెద్ద పనివాని వేతనములు, అతని కుటుంబ పోషణకు, అంటే, యీ అయిదుగురి పోషణకు సరిపడినవే కాదా? కూలీవర్గం నశించి పోకుండా బ్రతికివుండి, శాఖోపశాఖలుగా విస్తరించుటకు సరిపడే కనీస వేతనములు, ఆ పనివానికి లభించేవి గాదా? బూర్జువాలు చెప్పే బూటకపు మాటలకింక వేరే అర్థంవుందా? అదివరలో తాము స్వాధీనం చేసుకొని, ఉపయోగించుకుంటూన్న ఒక్క పనివానికి బదులుగా నాలుగురెట్లు మంది జీవితాల్ని ఉపయోగించుకుంటూ, ఆ ఒక్క కూలీ కుటుంబానికే సరిపడు జీవనభృతిని మాత్రమే పెట్టుబడిదారులు యిస్తూన్నారు!

దీనికంతకూ పర్యవసానం ఏమిటి? ఉత్పాదక పెట్టుబడి పెరుగుతూన్న కొలదీ శ్రమవిభాగాన్నీ, నూతన యంత్రాల్నీ అధికంగా ఉపయోగంలోకి తెస్తుంది; నూతనయంత్రాలూ, శ్రమవిభాగమూ, ఎక్కువగా బయలుదేరిన కొలదీ పనివాళ్ళలో నిరుద్యోగమూ, పోటీలూ వ్యాపిస్తాయి; అంతకంతకు వాళ్ళ వేతనాలు దిగనారి పోతూంటాయి.

ఇంతే కాదు. సమాజంలోని ఉన్నత శ్రేణుల్లోంచి కూడా చాలమంది కూలి వాళ్ళుగా అయిపోతారు. చిన్న చిన్న వర్తకులు, చిన్న వడ్డీవ్యాపారులు,_ వీళ్ళు కూడా చివరకు కూలి- పనివాళ్ళ వర్గంలోకి బలవంతంగా నెట్టివేయబడతారు. అందరు కూలీలతో బాటుగానే వీళ్ళుకూడా జీవిత భృతికై చేయి జాపి, అర్థించవలసిన గతి పడుతుంది. వీళ్ళకి కూడా వేరే గత్యంతరం వుండదు. పనులకోసం దేబిరించుతూ, ప్రార్థనా పూర్వకంగా జాపబడిన చేతులసంఖ్య దిన దినానికీ హెచ్చుతూంటుంది; అదే సమయంలో యీ జాపబడే చేతులు రోజు రోజుకూ కృశించినవీ,

బలహీనమైనవి అయిపోతూంటాయి.

ఈ పారిశ్రామిక పోరాటంలో ఒక నియమం వుంది. నిరంతరమూ అత్యధికోత్పత్తి చేస్తూంటేనే లాభాలు వస్తాయి. ఆలాంటప్పుడు చిన్న చిన్న పరిశ్రమల వాళ్లు యీ పోరాటంలో యెంతో కాలము నిలబడి వుండలేరని స్పష్టమేగదా! అంతే కాదు. ఒకడే, ఒకేసమయంలో చిన్న పరిశ్రమదారుడుగానూ, పెద్ద పరిశ్రమాధికారి గానూ కూడా వుండడం, అసంభవమని కూడా మనకు తెలుసును.

మూలధనములు పరిమాణంలోనూ, సంఖ్యలోనూకూడా అభివృద్ధి జెందుతూ, వాటిమీదవచ్చు వడ్డీరేటు తగ్గుతూ వుంటుంది. పెద్ద పెద్ద పెట్టుబడులు పోగుపడి, వృద్ధిజెందడంలో యీ వడ్డీరేటు సుతరామూ దిగిపోతుంది. అందువల్ల చిన్న పెట్టుబడిదారులు తమకు వచ్చే స్వల్ప వడ్డీలతో జీవితములను గడుపజాలక, పరిశ్రమలను బయలుదేర తీస్తారు. అంటే చిన్నచిన్న పరిశ్రమలు హెచ్చుతాయి. కూలీలకు పని చూపువాళ్లు అధికసంఖ్యాకులు అవుతారని వేరే

చెప్పాలా?

పారిశ్రామికాభివృద్ధి, యీ మార్గములో ముందుకు సాగుతూంటే, అప్పట్లో వున్న ఉత్పత్తి సాధనాలను రోజు రోజుకూ అధికాధికంగా వుపయోగించుకుంటూంటారు, పెట్టుబడిదారులు. అంటే, పరిశ్రమలు అంతకంతకు బ్రహ్మాండమైన పరిమాణం గలవిగా అవుతూవస్తాయి. వీటిని లాభప్రదంగాను, నిర్విఘ్నంగాను నడపాలంటే యెంతో ధనం అవసరం; పరపతి సాధనాలు, స్థానాలు కూడా త్వరితంగా రంగం మీదికి లాక్కు రాబడతాయి. [బ్యాంకులు మొదలైనవి, యీ దశలో బయలుదేరినవే] వీట్లన్నిటితో బాటు పారిశ్రామికభూకంపాలను కూడా కొని తెచ్చుకుంటారు. ఈ క్షోభలు అంతకంతకు తరచుగా సంభవిస్తూంటాయి. ఈ క్షోభలలో పెట్టుబడిదారులు తమసంపదలు, సరుకులు, చివరకు ఉత్పత్తి సాధనాలు కూడా కొంతవరకు నాశనమై పోడానికి అంగీకరించి, తమ స్థితిని నిలబెట్టుకో గలుగుతూన్నారు. పారిశ్రామిక క్షోభలు అంతకంతకు యెక్కువ తర

చుగానూ, తీవ్ర తరంగానూ వస్తూంటాయి. వస్తూత్పత్తి అధికం అవుతుంది; దానితో విశాలమైన మార్కెట్లు అవసరమవుతాయి. ప్రపంచం అంతటా వున్న మార్కెటు పరిమితమై పోతూంటుంది; దోపిడీ చేయ తగిన [వర్తకంవల్ల] ప్రదేశాలు క్రమ క్రమంగా తగ్గుతూ వస్తాయి. అంతవరకూ జయించబడని మార్కెట్లూ, మితంగా ఉపయోగించ బడుతూన్న మార్కెట్లూకూడా ఒక్కొక్క ఆర్థిక క్షోభతో, పూర్తిగా లొంగు బాటులోకి వస్తూంటాయి. కాని, యీ మార్కెట్లకు ఒకపరిమితి వుండేతీరింది. గనుక ఆ ఆర్థికక్షోభలు అంతకంతకు మరీ తీవ్రంగానూ, తరచుగానూ సంభవిస్తాయి.

పెట్టుబడి, శ్రమమీదనే జీవించి వూరుకోదు. ప్రతీ ఆర్థిక క్షోభలోనూ యెన్నో వ్యక్తి పెట్టుబడులు నాశనమై పోతూనే వుంటాయి. అవి వాటితో బాటు లక్షలకొలది కూలీల్నికూడా నాశనం చేస్తూంటాయి. పూర్వ కాలంలో సుప్రసిద్ధులు, మూర్ఖులు, అయిన ప్రభువులు తమ బానిసల్నీ, సంపదల్నీ తమతో బాటు

సమాధిలోకి తీసుకు పోయేవాళ్ళు! అదే యిక్కడా జరుగుతూంది.

ఈ రీతిగా పెట్టుబడి యెంత శీఘ్రంగా వృద్ధి పొందుతే, పనివాళ్ళ మధ్య పోటీ అంత శీఘ్రతరంగా పెరుగుతుందని తెలుసుకున్నాము. అంటే, పెట్టుబడి యొక్క అభివృద్ధితో బాటు కార్మికవర్గానికి నిరుద్యోగమూ, దారిద్ర్యమూ కూడా వృద్ధిచెందుతూ వుంటాయి! అయినా సరే, పెట్టుబడి యొక్క సత్వరాభివృద్ధిలోనే, కూలి - పనికి [కార్మికులకు] యెంతో అనుకూలించు పరిస్థితులు యిమిడి వుంటాయి!

సంపూర్ణము.]

# విశ్వసాహిత్యమాల

## మా యితర గ్రంథాలు.

| | | |
|---|---|---|
| లియో టాల్ స్టాయి | * | 0-3-0 |
| హిందూదేశము: క్రైస్తవ పరిభుత్వనిర్మాణతత్వం | * | 0-8-0 |
| ఇటలీ | | 0-4-0 |
| ఫాసిజం: కమ్యూనిజం: స్త్రీలు | * | 0-4-0 |
| సందేశం | * | 0-2-0 |
| కారల్ మార్క్స్ ఉపదేశాలు | § * | 0-6-0 |
| సోషలిజం ఎందుకు | † | 1-0-0 |
| నా రష్యాయాత్ర | | 0-8-0 |
| సోవియటు కమ్యూనిజం | | 0-6-0 |
| రష్యా విప్లవం | § * | 0-6-0 |
| విప్లవగీతాలు | * | 0-0-6 |
| లెనిన్ ఉపదేశాలు | | 0-6-0 |
| పారిస్ కమ్యూన్ | | 0-6-0 |
| నాడు—నేడు | | 1-4-0 |
| కమ్యూనిస్టులతో- | | 0-1-6 |
| రాజ్యాంగయంత్రం | | 0-2-0 |

| | |
|---|---|
| విప్లవ సందేశం | 0-2-0 |
| చీనా కథలు | 0-4-0 |
| పల్లెటూళ్లలో | 0-6-0 |
| కూలి-పని: పెట్టుబడి | 0-6-0 |
| అర్థశాస్త్ర మూలసూత్రాలు | 0-1-0 |

* ప్రతులు లేవు.

§ నిషేధించబడింది.

† తిరిగి ముద్రించబడుతూంది.

తెనుగు భాషలో వెలువడే నిత్యనూతనగ్రంధాలు కావలసి వుంటే వెంటనే మాకు వ్రాయండి. ఒకేచోటనుంచి అన్ని గ్రంధాలూ తెప్పించుకోడం వలన కనపడని ఖర్చు లెన్నో కలిసి వస్తాయి.

వెంటనే మా కేట్లాగుకు వ్రాయండి:—

## విశ్వ సాహిత్య మాల

ముంగండ,

(వయా) అంబాజీపేట, తూ. గో. జిల్లా.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106 B/126 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 131 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 22 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |